# స్త్రీ సమస్యలు – సంఘసంస్కరణ

181/2-84



జి. సకల M.A.

నాస్తిక కేంద్రం
పటమట : : విజయవాడ–520 006

STHRI SAMASYALU-SANGHA SAMSKARANA
(WOMEN PROBLEMS & SOCIAL REFORM)

By G. SAKALA, M. A.

First Edition : January 1984
వెల : రు. 5-00

Copyright :
ATHEIST CENTRE

Publisher;
Atheist Centre
Patamata,
Vijayawada 520 006

Printed at
Insaan Printers,
Benz Centre, Vijayawada 6.

# ముందుమాట

స్త్రీ సమస్యలకు—సంఘ సంస్కరణకు అవినాభావసంబంధం వుంది. సాంఘిక — ఆర్థిక అసమానతలవలన స్త్రీలు సమాజంలో తరతరాలుగా అణచి వుంచబడ్డారు పురుషుడు వ్యవస్థకు మాత్రమే బానిస. చాలా సందర్భాలలో స్త్రీ వ్యవస్థకూ, పురుషునికికూడా బానిసగా చేయబడింది. అందుచేత ఆమె ఎంతో క్రౌర్యానికి, అక్రమాలకు గురిచేయబడింది.

సమాజంలో అభివృద్ధి సాధించాలంటే అన్ని రంగాలలో మార్పు రావాలి. వివిధ రంగాలలో సంఘ సంస్కరణకై గత 150 సంవత్సరాలుగా జరిగిన కృషిని ఈ పుస్తకంలో శ్రీమతి సకల వివరించారు. మారుతున్న సమాజానికి—మారని విలువలకు మధ్య గల సంఘర్షణను ఈ పుస్తకంలో చక్కగా వివరించారు. విజ్ఞాన దాయకమైన ఈ పుస్తకం మహిళా సమస్యలను కొంతవరకు అర్థం చేసుకొనడంలో చేయూత నివ్వగలదని ఆశిస్తున్నాం.

నాస్తిక కేంద్రం

# విషయ సూచిక

# స్త్రీ సమస్యలు - సంఘ సంస్కరణ

## అమానుషమైన సతీ సహగమనం

అంతరించి పోయిందనుకున్న సతీ సహగమనం మరల అప్పుడప్పుడు మనదేశంలో జరుగుతూనేవుంది. ఈమధ్యనే ఉత్తరప్రదేశ్‌లో మైన్‌పూర్ జిల్లాలో షికోహాబాదు పట్టణానికి 6 కిలోమీటరుల దూరంలో వున్న పట్టిబనౌరా గ్రామంలో జరిగిన సంఘటన ఇందుకు ఉదాహరణ.

తన భర్త రణవీర్ చనిపోగానే, అతనికంటే మూడుసంవత్సరాలు చిన్నదైన 24 సంవత్సరాల ఓమవతీదేవి సతీ సహగమనం చెయ్యాలని నిశ్చయించుకొంది.

గ్రామస్తులు ఓమవతి నిర్ణయాన్ని తప్పని చెప్పేబదులు, ఒక 'మహాసాధ్వి' చేస్తున్న ఘనకార్యంగా హర్షించారు.

రణవీర్ ఒక కాలేజీ క్లర్కుగా వుండేవాడు. ఆగ్రాలో ఒక ఆస్పత్రిలో చనిపోగా అతని శవాన్ని గ్రామానికి తీసుకువచ్చారు. తనకి ఒకటిన్నర సంవత్సరం కొడుకువున్నా, భర్త శవంమీదపడి చావడానికే ఆమె నిశ్చయించుకొంది.

75 సంవత్సరాలక్రితం నిషేధింపబడ్డ పురాతన ఆచారాన్ని ఆమె పునరుద్ధరిస్తోందని గ్రామస్తులు హర్షించారు. అమ్మలక్కలు ఆమెను గౌరవించారు. ప్రోత్సహించారు.

సహగమనం సంగతి తెలిసిన సబ్‌డివిజినల్ మేజిస్ట్రేటు చిన్న పోలీసుబలగంతో ఆ గ్రామానికి వచ్చారు. కాని, అప్పటికప్పటికే వందలాదిమంది చుట్టుప్రక్కలనుండి వచ్చి సహగమనం జరగనున్న

ప్రాంతంలో క్రిక్కిరిసివున్నారు. పోలీసులు వచ్చేసరికి కొంతమంది మహిళలతోకలసి ఓమవతి 'సతీవందన' చేస్తూవుంది. పోలీసులు ఆపేలోగానే చితిమీదకుఎక్కి భర్తతలని తన వడిలోనికి తీసుకొందిట.

నిప్పుముట్టించ బోతూవుండగా, పోలీసులు బలవంతంగా ఆమెను బయటకులాగి, జీపు ఎక్కించారట. కాని, పోలీసు జీపుతాళాలు ఎవరో 'దొంగిలించడంతో' అది బయలుదేరలేదు. ఈ సందట్లో ఆమె జీపులోంచి తప్పించుకొని తగలబడుతున్న భర్త శవంమీదకు దూకిందట. ఆ మంటలో నుండే తన మేనల్లుళ్ళలను ఆశీర్వదించడానికి చేతులు బయటపెట్టేసరికి ఆమెను మంటలోనుండి బయటకు లాగడం జరిగింది. దానితో సహగమనం చూచి ఆనందించడానికి చేరిన జనసమూహానికి ఆశాభంగం కలగడంతో పోలీసులపై రాళ్ళురువ్వారట.

ఇదే మన మౌఢ్యభారతం! 'మహాపతివ్రత', 'మహాసాధ్వి' భర్తతో కలిసి 'కైలాసానికి' వెళతానంటే మధ్యలో ఈ పోలీసులు, ఈ చట్టాలూ అడ్డం ఏమిటని ఆ గ్రామస్తులు భావించారు.

## క్రూరమైన పురాతన ఆచారం

చరిత్రలోకి తొంగిచూస్తే సహగమనం అనే క్రూరమైన ఆచారం చాలాకాలం సాగింది. భార్యేకాదు, తల్లులు, ఉంపుడుకత్తెలుకూడా "మొగదిక్కు" పోవడంతో నిప్పులో ఆ శవంపైపడి మరణించిన సందర్భాలు వున్నాయి. అయితే భార్యలే ఎక్కువగా ఈ సహగమనానికి పూనుకొన్నారు. 'సత్యవ్రత' అన్న సంస్కృతశబ్దంనుండి ఈ సహగమనం వచ్చింది. దీనినే 'సహమరణం' అని, 'సహగమనం' అని భర్తతోపాటు ఆ చితిపై మరణిస్తే అంటారు.

భర్త మరెక్కడో మరణిస్తే, ఆ అస్థికలపైపడి స్త్రీ మంటలో చనిపోతే దానిని 'అనుమరణ' మని, 'అనుగమన' మని అనేవారు.

## రాజస్థాన్‌లో ప్రబలమైన దురాచారం

ఈ సహగమనం అనేది పురాతనకాలంలో ప్రారంభమైన మూఢ నమ్మకం. ఆర్యులు ఆగమనంతో ఈ ఆచారం క్రీస్తుకు పూర్వమే ప్రారంభం అయింది. ఉత్తరభారత దేశంలో క్రీస్తుకు పూర్వం 510 సంవత్సరంలో సతీసహగమనం జరిగినట్లు శిలాశాసనఆధారాలవల్ల తెలుస్తోంది. ఇది ముఖ్యంగా రాజస్తానులో ఒక ఆచారంగా రూపొందింది. మొదట్లో ఐచ్ఛికమైనా, మధ్యయుగాలు వచ్చేసరికి భర్తతో భార్య చితిపైపడి నిప్పులలో కాలిపోవడం అన్నది తప్పనిసరిగా చెయ్యవలసిన మూఢాచారంగా మారింది. రాజస్తానులోని మేవార్, మార్వాడ్, జయపూర్, బికనీరు ప్రాంతాలలో సతీసహగమనం విస్తృతంగా జరిగిందని సమాధులపై చిత్రాలవల్ల, వ్రాతలవల్ల తెలుస్తోంది.

ఇది రాజకుటుంబాలలోనేకాక, ఉన్నత కుటుంబాలన్నింటిలో వ్యాప్తిచెందింది. అయితే వెనుకబడ్డ కులాలు సతీసహగమనాన్ని అనుసరించలేదు.

కొంతమంది ఈ క్రూరఆచారాన్ని వ్యతిరేకించినా సహగమనం అనేది 18వ శతాబ్దానికి చాలా వ్యాప్తిలోకి వచ్చింది. సహగమనానికి సాంఘికకారణాలేకాక, ఆర్థికకారణాలుకూడా తోడయ్యాయి. సమాజంలో స్త్రీ స్థానం ఎంత పతనమైందో విధవలపాట్లు తెలియజేస్తాయి.

హిందూమతాచారాలు, దుర్గాపూజ, రాజపుత్రులయుద్ధవీరత్వభావాలు యివిఅన్నీ స్త్రీలను సహగమనానికి ప్రోత్సహించాయి. సహగమనం ఒక గౌరవంగా పరిణమించింది. అలాంటి స్త్రీలకు రాజస్తానులో వివిధప్రాంతాలలో పెద్ద సమాధులుకూడా నిర్మించేవారు. మహమ్మదీయుల దండయాత్రలకు భయపడి, తమ శీలరక్షణకుకూడా సహగమనం అనుసరించారు.

కాని, సతీసహగమనం తప్పు అని సమాజంలో ఒక భావంకూడా ప్రబలడంతో, ముస్లింరాజులు దీనిని నిషేధించాలని ప్రయత్నించారు.

అక్బరు, జహంగీరు, ఔరంగజేబు దీనిని నిషేధించారు. కొంతమంది రాజపుత్ర రాజులుకూడా నిషేధించాలని ప్రయత్నించారు.

అయితే, పురాతన ఛాందస మతభావాలు ఈ సహగమనానికి తోడ్పాడ్డాయి. అందుచేతనే ఈ ఆచారాన్ని నిషేధించడానికి చాలామంది అడ్డుపడ్డారు.

## సంస్థానాలకు వర్తించని బ్రిటిష్ చట్టం

సాంఘిక దురాచారాలను నిర్మూలించడానికి పూనుకున్న గవర్నరు జనరల్ విలియం బెంటింక్ బ్రిటీషువారి ఆధీనంలోఉన్న మనదేశంలో సతీసహగమనాన్ని 19వ శతాబ్ద ప్రారంభంలోనే నిషేధించగలిగాడు. అయితే, స్వతంత్ర ప్రతిపత్తిగల స్వదేశ సంస్థానాలలో సతీసహగమనం చాలా పెద్దఎత్తున జరుగుతూనే వుండేది.

రాజస్తాను స్వదేశసంస్థానాలకు నిలయం కావడంతో బ్రిటీషువాళ్లు వచ్చాకకూడా అక్కడ సహగమనాన్ని నిషేధింపజెయ్యాలంటే వెంటనే సాధ్యంకాలేదు. రాజస్తాను రాజులను ఈ విషయంలో మార్చాలని, సహగమనాన్ని నిషేధింపచెయ్యాలని ఎంత ప్రయత్నించినా చెవిటివాని ముందు శంఖం వూదినట్లు అయింది. అంతేకాదు ప్రజల్లోనుండికూడా, ముఖ్యంగా ఠాకూరులనుండి సతీనిషేధానికి చాలా వ్యతిరేకత వచ్చింది. తమ విశ్వాసాలలో దీనిని విదేశీయుల జోక్యంగా భావించారు. రాజులు, జమీందారులు చనిపోయినప్పుడూ, ఇతర సందర్భాలలోనూ సహగమనం అవిచ్ఛిన్నంగా కొనసాగింది.

కాని 19వ శతాబ్దం ప్రారంభంలో బ్రిటీషువారికృషి, సాంఘిక దురాచారాలను నిర్మూలించాలని ఇతరులు జరిపిన ప్రయత్నాలతో రాజస్థానులోని కొన్ని స్వదేశసంస్థానాలలోకూడా సతీసహగమనాన్ని నిషేధించగలిగారు.

1846 లో జైపూర్ సహగమనాన్ని నిషేధించి, దానిని అమలు పరచవలసిన బాధ్యత జాగీరుదార్లకు, ఇతర గ్రామోద్యోగులకు అప్ప జెప్పింది. 1847 లో సతీసహగమనాన్ని అడ్డుకోనందుకుగాను నలుగురికి 5 సంవత్సరాల శిక్ష మొట్టమొదటిసారిగా జైపూర్‌లో విధించారు.

అసలు సతీసహగమనం శాస్త్రరీత్యాకూడా తప్పు అని కొందరు సంస్కరణవాదులు వాదించారు. ఐతే, గ్రామస్తులమౌఢ్యాన్ని అడుగడుగునా ఎదుర్కొవలసివచ్చింది. 1967 లో పంచపహర్ జిల్లాలో సూర్లీ గ్రామంలో సతీసహగమనం ఆపాలని పోలీసులు ప్రయత్నిస్తే, 9 గంటలు గ్రామస్తులతో హోరాహోరిగా పోరాడవలసి వచ్చింది. పాతివ్రత్య ధర్మాన్ని అపేహక్కు ప్రభుత్వానికిలేదని హిందూమతవాదులు అడ్డు పడ్డారు. వారిలో పదిమందిని అరెస్టుచేస్తేగాని సహగమనం అపడం సాధ్యంకాలేదు. అయితే. రాజస్తానులో వివిధగ్రామాలలో సతీసహగమనం జరిగిపోతూనే వుండేది.

ఉదయపూర్ మహారాణా సతీసహగమనాన్ని చట్టరీత్యా నిషేధించాడు. కాని, 1861లో మహారాణా చనిపోగానే రాణులందరు సహగమనం చెయ్యాలని ఠాకూర్లు చాలా ప్రయత్నంచేశారు. అయితే, పాత ఆచారాన్ని అనుసరించడానికి రాణులు అంగీకరించక పోవడంతో భంగపడిన అసింద్ ఠాకూర్ అజియాబాయి అనే బానిసపిల్లచేత మహారాజుతోపాటు సహగమనం చేయించాడు.

దానితో ప్రభుత్వం ఆ జమీందారుఆస్తి జప్తుచేసింది. ఇతర సందర్భాలలో గ్రామస్తులందరిపై సాముదాయక జరిమానాలుకూడా విధింపబడ్డాయి. 1868 మేంభల్‌గర్ పరగణాలోని సెల్లోద్ గ్రామంలో సహగమనం ప్రోత్సహించి, స్త్రీ చనిపోతూవుంటే చూచినందుకు 68 మందిని అరెస్టుచేశారు.

అయితే, మేవార్‌లో మహారాణా శంభూసింగ్ 1874 లో చనిపోగానే నలుగురు అంతఃపురవాసులు చితిపై ఆత్మాహుతికి ప్రయత్నించారు.

లెఫ్టినెంటు కర్నల్ రైటు వారిని నిరోధించాడు. కాని, మహారాజు ఒక్కడూ తగలబెట్టబడటం తనకి పెద్ద అవమానంగా భావించింది ఆ మహారాజు తల్లి!

కొంతమంది రాజులు, జమీందార్లు పైకి సతీసహగమనాన్ని వ్యతిరేకించనట్లువున్నా, ఆచరణలో ఈ పాతఆచారాన్ని ప్రోత్సహించే వారు. ఇలాంటివారిని లొంగదియ్యడానికి బ్రిటీషు ప్రభుత్వం వారి అతిధిమర్యాదలను తగ్గించడానికి, ఇతర ఇబ్బందులను కలిగించడానికి పూనుకొనేది. సతి అనేది చాలా క్రూరమైన మత ఆచారమని బ్రిటీషు ప్రభుత్వం భావించడంచేత నయాన భయాన రాజస్తాను రాజులను ఈ విషయంలో మార్చింది. అందుచేతనే 1846 వచ్చేసరికి రాజస్తానులోని 18 స్వదేశ సంస్థానాలలో 11 సంస్థానాలు సతిని నిషేధించాయి. పెద్ద సంస్థానాలు మాటవినలేదు. కాని, 1861 కల్లా రాజస్తానులో అన్ని స్వదేశ సంస్థానాలూ సతిని చట్టరీత్యా అంతమొందించాయి.

## మూఢనమ్మకానికి నిలయం గ్రామాలు

అయితే, 'చింతచచ్చినా పులుపు చావలేదన్నట్లు' 1956లో జోధపూర్‌లో ఒక జాగీరుదారు భార్య సతీసహగమనం చేసింది. ఆ 'సాధ్వి'ని గౌరవించడానికి అక్కడ ప్రతీసంవత్సరం ఒక ఉత్సవంకూడా జరుగుతూ వుంటుందట.

1973లో సికర్ జిల్లాలో నాలుగు సతీసహగమనాలు జరిగాయి. ఈరకంగా చట్టరీత్యా సతీసహగమనాన్ని నిషేధించినా, అడపాదడపా అక్కడక్కడ మనదేశంలో ఈ అమానుషం జరుగుతూనేవుంది,

ఈ మధ్య ఉత్తరప్రదేశ్‌లో ఓమవతి సహగమనానికై నిప్పులో భర్త శవంమీదకు దూకగలిగిందంటే, గ్రామాలలో పాతనమ్మకాల ప్రభావం ఎంతగా పాతుకుపోయిందో అర్థం అవుతుంది. సీత, సావిత్రి

పతిభక్తి అని పుక్కిటిపురాణాలు వినివిని ఈఆధునిక కాలంలో మూర్ఖంగా ప్రవర్తించి భర్తతోపాటు చావడానికి కొందరుసిద్ధమైతే, సినిమాలో చూచి నట్లు ప్రత్యక్షంగా ఈ సన్నివేశాన్ని చూచి "తరించాలనే" కోరిక కొంత మందిలో పెరిగిపోయింది. అందుచేతనే, "పిల్లికి చెలగాటమైతే, ఎలుకకు ప్రాణసంకటం" లాగా తయారయింది కొంతమంది స్త్రీల బ్రతుకు.



# ఆడ శిశువుల హత్యలతో రక్తసిక్త చరిత్ర

స్త్రీలకు పురుషులతోపాటు అన్నిరంగాలలో సమానత్వం కావాలని ఈ శతాబ్దంలోనే కృషిజరుగుతోంది. విద్యా, ఉద్యోగ అవకాశాలలో, ఆస్తి హక్కులో స్త్రీలకు కూడా సమానహక్కు ఉందని శాసనాలు వస్తున్నాయి. ఆచరణలో ఈ సమానత్వాన్ని అంగీకరించడానికి ముందు వెనకలుగా కృషి జరుగుతూ ఉంది. అయినా ఈ నాటికీ ఆడపిల్ల పుట్టిందంటే బాధపడే తల్లిదండ్రులు చాలామంది ఉన్నారు. దీనికి కారణం స్త్రీకి సమాజంలో సమానత్వం లేకపోవడమే.

స్త్రీ జాతి చరిత్రలోకి తొంగిచూస్తే సమానత్వం వేపు పురోగ మించడానికి అడుగడుగునా అడ్డంకులను అధిగమించవలసి వస్తూంది అనేది స్పష్టమౌతోంది. మనదేశ చరిత్రలో 17, 18 శతాబ్దాలలో కొన్ని చోట్ల స్త్రీకి బ్రతికి ఉండడానికే స్వేచ్ఛలేకపోయింది. ఉత్తర భారత దేశంలో, ముఖ్యంగా రాజస్తాన్‌లో, ఆడపిల్ల పుట్టిదంటే వెంటనే చంపేసేవారు. ఈ రకంగా శిశుహత్యలలో మనదేశ చరిత్ర రక్తసిక్త మైంది.

పుట్టగానే ఆడశిశువును గొంతు నులిమి చంపేసేవారు. రాజస్తాన్‌లో ఘోషాపద్ధతి ఉండడంవల్ల దగ్గర బంధువులకు తప్ప మరొకరికి ఈ

పరిస్థితులే ఇంతటి దారుణానికి దారితీశాయి. శిశుహత్య అనేది ఒక వీరత్వంగా, పాతివ్రత్య ధర్మంగా, తన కర్తవ్య నిర్వహణలో ప్రధాన భాగంగా భావించిన ఆ స్త్రీ తన మాతృత్వ చైతన్యాన్ని మంటగలిపి అంతటి దౌష్ట్యానికి పాల్పడ గలిగింది.

ఈ రకమైన దారుణం చెదురు మదురు సంఘటన కాదు. విల్కిన్‌సన్ కథనం ప్రకారం రాజస్తాన్‌లోని మాల్వా ప్రాంతంలోనే 1836 ప్రాంతంలో 20,000 శిశుహత్యలు జరిగినవని తెలుస్తోంది. అయితే విల్కిన్‌సన్ అంచనాలు సరికావని మరికొంత మంది వాదం. జనానాలో జరిగిపోయే ఈ ఘాతుకాలను అంచనా వేయడం ఎలాసాధ్యం అన్నది ఆనాటి ప్రశ్న. ఏది ఏమైనా రాజస్థాన్‌లోని ఒక్కొక్క ప్రాంతంలో కొన్ని వందలమంది ఆడశిశువులను ప్రతీ సంవత్సరం హత్యచేసినట్లు వివిధ కథనాలవల్ల స్పష్టమౌతోంది. అసలు ప్రశ్న ఎంతమందిని చంపారనికాదు, ఎలా చంప గలిగారనేది, ఎందుకు చంపారనేది.

## ఆడపిల్ల అంటే గుండెలమీద కుంపటి

దీనికి సమాధానం రాజస్తాన్‌లోని ప్రజల స్వభావంలోనే కన బడుతుంది. ఆనాటి సామాజిక వాతావరణంలో ఆడపిల్లకు పెళ్ళి చేయడం అతికష్టంగా ఉండేది. ప్రతివారూ తమకంటే ఉన్నత కుటుంబంలోనే ఎక్కువ కట్నం ఇచ్చి వివాహం చెయ్యాలన్న అత్యాశకు లోనయ్యేవారు. ఇది అసాధ్యం కనుక యుద్ధరంగంలో వీరత్వం చూపించగలిగినా లేక పోయినా, ఇంట్లో క్రూరత్వానికిమాత్రం లోటు ఉండేది కాదు. ఆడపిల్లను పెంచి పోషించి, గౌరవంగా కట్నంతో పెళ్ళిచేయగలమో లేదో అనే భయంతో పాల బుగ్గల పసిపాప జీవితాన్ని మొగ్గలో త్రుంచివేసి అంత మొందించేవారు. తల్లీ, తండ్రీ ఇద్దరూ ఈ అకృత్యాన్ని వీరత్వం అనుకునేవారు, మూఢత్వం మూర్తీభవించిన ఆనాటి సమాజంలో సతీ

సహగమనంతోపాటు శిశుహత్యకూడా ఒక వీరోచిత చర్యగా, కర్తవ్య నిష్ఠాపరత్వానికి చిహ్నంగా భావించిన మౌఢ్య భారతమది.

రాజస్తాన్‌లో ఆడపిల్లకు కట్నం ఇవ్వడమేకాదు. పెళ్ళికి ఎంతో మందిని పిలవడంకూడా ఒక ఆచారంగా ఉండేది. పురాతన ఆచారాల భారంతో క్రుంగిపోయిన తల్లిదండ్రులు అంత్య నిష్ఠూరంకంటె ఆది నిష్ఠూరం మేలని కన్న కూతురినే చేతులారా చంపుకున్న కాలమది.

## 19వ శతాబ్దంవరకు దురాచారం

ఈ ఆచారం తప్పని తెలిసినా దీనిని ఖండించగల ధైర్యం, సాహసం ఆరోజులలో రాజులకులేదు. 19వ శతాబ్దం ప్రారంభంలోనే కొంతమంది రాజులు ఈ సాంఘిక దురాచారాన్ని అరికట్టడానికి పూను కున్నారు. జోధ్‌పూర్ మహారాజా శక్తికిమించి కట్నాలు ఇవ్వవద్దని తల్లిదండ్రులకు సలహా ఇచ్చాడు. బంధు మిత్రులకు కానుకలు ఎంతెంత ఇవ్వాలో నిర్ణయించాడు. అప్పుడప్పుడు తానే ఆర్థికంగా సహాయం చేశాడు.

ఉదయపూర్ మహారాజా 1831 లో ఆడశిశువుల హత్యలను నిషేధించాడు. అయినా జహాజ్‌పూర్ ప్రాంతంలోని మీన తెగవారు శిశుహత్యను పెద్ద ఎత్తున కొనసాగిస్తూ ఉండేవారు. ఒక్కొక్క కుటుంబంలో తల్లి ముగ్గురు ఆడపిల్లలను చంపిన దారుణ సంఘటనలు కూడా ఉండేవి.

అప్పటి గవర్నర్ జనరల్ విలియం బెంటింక్ సతీసహగమనంతో పాటు శిశుహత్యను కూడా నిషేధించడానికి పూనుకున్నాడు. అయితే స్వదేశ సంస్థానాలకు ఈచట్టంవర్తించదు. కనుక రాజస్తాన్‌లో ఈ దురాచారాన్ని అరికట్టడానికి అక్కడి మహారాజుల సహకారాన్ని అర్థించడం జరిగింది. నయాన, భయాన వారిని లొంగదీయడానికి ప్రయత్నం జరిగింది.

## భట్రాజుల అకృత్యాలు

అయినా ఈ పురాతన ఆచారం కొనసాగుతూనే ఉండేది. పెళ్ళిళ్ళ సమయంలో రాజస్తాన్‌నుండి భట్లు, చరణ్‌లు పెళ్ళిచేసుకునే వారు తమకు పెద్దమొత్తాలలో బహుమతులు ఇవ్వాలని పట్టుబట్టేవారు. వీరు పెళ్ళి కూతురు తల్లిదండ్రులనుండి డబ్బు తీసుకోవడం కొరకు పెళ్ళిపందిరిముందు ముసలివారైన తమ బంధువులను తీసుకొచ్చి చంపి పడేసేవారు. ఈ రకంగా తమకు పెద్దమొత్తాలలో "త్యాగ్" ధనం ఇవ్వాలని పట్టుబట్టేవారు. ఈ బాధ భరించలేక మహారాజా తాకత్‌సింగ్ మేవార్‌లో చరణ్‌లుగానీ, భట్లుగానీ ఇతరులను చంపడం, ఆత్మహత్య చేసుకోవటం నిషేధిస్తూ ప్రకటించారు. పెళ్ళిళ్ల సందర్భంలో భట్లు, చరణ్‌లు మార్వార్‌నుండి ఇతరప్రాంతాలకు వెళ్ళి ఆత్మాహుతి చేసుకోవడాన్ని 1860లో నిషేధించడం జరిగింది.

కోటా, గుండి సంస్థానాల్లో 1889లో శిశుహత్యను నిషేధిస్తూ శాసనం చేయడమేగాక ప్రతీ గ్రామంలో ఈ విషయం గురించి శిలాశాసనము వేయించారు. 1893లో ఏ రాజపుత్రుడైనా శిశుహత్యకు పాల్పడితే దేశబహిష్కరణ జరుగుతుందని గుండీ సంస్థానంలో ప్రకటించారు. ఆ కారణంచేత కుచోవాలా ఠాకూర్‌ను, కుటుంబాన్ని ఆ సంస్థానంనుండి బహిష్కరించారు.

## సమస్య రూపంమాత్రం మారింది

ఈ రకంగా శిశుహత్యను నిషేధించడం జరిగినా, కట్నాలు యివ్వలేక పెళ్ళిళ్ళుకాని ఆడపిల్లల సమస్య మాత్రం రాజస్థాన్‌లో అపరిష్కృతంగానే ఉండిపోయింది. మూఢనమ్మకాలకు, పాత ఆచారాలకు పట్టినిల్లయిన రాజస్తాన్‌లో ఏ మార్పు రావాలన్నా అతి కష్టంగా వుండేది. అందులోనూ పౌరోహిత్య వర్గం తన ప్రాతినిధ్యం పెంపొందించుకోవడానికి పాత ఆచారాలను పెంచి పోషించేది. కుల, మత భేదాలు

రాజస్తాన్‌లో మరీ ఎక్కువ. అందుచేత ఆడపిల్లల పెళ్ళిళ్ళు అతి కష్టంగా జరిగేవి.

20వ శతాబ్దపు ప్రారంభంతో పెరిగిన రాజకీయ చైతన్యం, విద్య, విజ్ఞానం, ఇతర ప్రాంతాల గురించి తెలుసుకోవడంవల్ల అతి క్రూరమైన ఈ శిశుహత్య దురాచారం అంతమొందింది.

అయినా సమస్య రూపం మారిందిగాని, సమస్యా పరిష్కారం మాత్రం ఇంకా జరగలేదు. బాల్యవివాహాలు, వరకట్నాలు సమాజంలో స్త్రీకి సరియైన స్థానం లేదని నిరూపించాయి.

ఈనాడు విజ్ఞానం పెరిగినకొద్దీ అజ్ఞానాంధకారం తొలగిపోతోంది. వయోజన ఓటింగు హక్కుద్వారా స్త్రీలకు రాజకీయ రంగంలో సమానత్వం, హిందూకోడ్ బిల్లులద్వారా ఆస్తిహక్కులో, సాంఘిక మర్యాదల్లో పెరుగుతున్న అవకాశాలు; మహిళలలో విద్యావ్యాప్తితో పెరుగుతున్న ఆర్థిక స్వాతంత్ర్యం ఈనాటి ప్రగతికి చిహ్నం. వంద సంవత్సరాలలో స్త్రీజాతి ఎంతో పురోగమించింది. అయినా అన్ని రంగాలలో సమానత్వం సాధించడానికి ఇంకా ఎంతో ముందడుగు వేయాలి.



# క్రూరమైన బాల్యవివాహాలపై నిషేధం

1929 లో మనదేశంలో వేలాది చిన్నపిల్లల పెళ్ళిళ్ళు గబగబా జరిగిపోయాయి. "దారుణమైన" శారదాచట్టం వచ్చేస్తోంది. ఇక ఆడపిల్లల "కన్నెచెర" విడిపించే నాథుడు వుండడని ఆరునెలల పసిపాపలకు కూడా కళ్యాణం జరిపించారు పెద్దలు. సనాతనులు భయభ్రాంతులయ్యారు. మతం మంటగలిసిపోతూవుందని గగ్గోలు చేశారు.

వంద సంవత్సరాలకుపైగా వివాహవయస్సు విషయంలో మార్పు రావాలని, చిన్నపిల్లల వివాహ విధానాల్ని అరికట్టాలని జరుగుతున్న ప్రయత్నాలకు హిందూమతస్తులు, సనాతనభావ సంపన్నులు అడ్డునిలబడి లక్షలాదిమంది ముక్కుపచ్చలారని ముద్దుపాపలకు "మూడుముళ్ళు" వేయించారు.

అయితే చిన్నపిల్లల వివాహం అన్న పాత ఆచారాన్ని నిషేధిస్తూ చిట్టచివరకు "శారదాచట్టం" రూపొందింది. సనాతన క్రూరఆచారంపై అభ్యుదయభావాల విజయం చట్టరీత్యా సాధ్యమైంది. కాని, ఈ క్రూర ఆచారం స్వాతంత్ర్యం వచ్చేవరకూ ఆచరణలో కొంతవరకు కొనసాగుతూనేవుంది. ఇప్పటికీ ఉత్తర భారతదేశంలో బాల్యవివాహాలు అక్కడక్కడ జరుగుతూనే వున్నాయి.

## 1929లో శారదాచట్టం

అసలు శారదాచట్టం అంటే ఏమిటో, దానిని ఎవరు, ఎందుకు ప్రవేశపెట్టారో సామాన్యులకు తెలియదు. ఆ చట్టం సనాతనుల పాలిట "భూతం" అయితే, అభ్యుదయభావాలు కలవారికి చీకటిని చీల్చుకొంటూ వెలుగునిచ్చే అరుణోదయపు ఉషఃకాంతిలాగా కనబడింది.

శ్రీ హరివిలాస్ శార్దా కేంద్ర శాసనసభలో బాల్యవివాహాలను నిషేధిస్తూ ఒక బిల్లును 1927 ఫిబ్రవరి 1న ప్రవేశపెట్టారు. అది సెలెక్టు కమిటీ ఆమోదాన్నికూడా పొందింది. అయితే ఈ మార్పుచట్టం అవకుండా ఆపడానికి చివరి నిమిషంవరకూ అభ్యుదయ నిరోధకులైన సనాతనులు శాయశక్తులా ప్రయత్నించారు. ఏదిఏమయినా, అంతిమ విజయం పురోభివృద్ధి కోరేవారిదే కావడంతో కేంద్రశాసనసభలో ఈ బిల్లు శ్రీహరివిలాస్ శార్దా ప్రతిపాదించడంవలన అయన పేరుతో "శారదాచట్టంగా" ఇది ప్రఖ్యాతిచెందింది. 1930 ఏప్రిలు 1నుండి బాల్యవివాహాలు నిషేధించడం జరిగింది. 14 సంవత్సరాలలోపు బాలికలకుగాని, 18 సంవత్సరాలలోపు బాలునికి వివాహం చేయడం చట్టవిరుద్ధమని, అరకంగా వివాహం జరిపించే

పెళ్ళిచేసి, మెడలో 'మంగళసూత్రం' వుంటే అంతమంచిదని ఒక కట్టు కధకూడా ప్రచారంలో వుండేది.

## ఘోరమైన సాంఘిక దురాచారం

బాల్యవివాహాలకు కారణం ఏదయినా ఫలితం మాత్రం ఒక్కటే. అతి చిన్నవయస్సులోనే ఆడపిల్లల పెళ్ళి అయిపోవడం జరిగేది. ఈ సాంఘిక దురాచారంవలన ఎన్నో క్రొత్త సమస్యలు ఎదురయ్యాయి.

ఎంతోమంది బాలికల జీవితాలు వికసించి, పుష్పించి, ఫలించకుండానే మట్టిపాలు అయిపోయాయి. అంటురోగాలకు, జబ్బులకు ఆలవాలమైన మన దేశంలో పెళ్ళిఅయిన తరువాత కాపరానికి రాకముందే, కొన్ని సందర్భాలలో భర్త చనిపోయేవాడు. దానితో కొన్నిప్రాంతాలలో అయితే స్త్రీ సతీసహగమనంచేసి భర్తతోపాటు చితిమీద చావవలసిందే 'చావు తప్పినా కన్ను లొట్టపోయింది' అన్నట్లు ఒకవేళ సహగమనం చెయ్యక పోయినా, జీవితమంతా వితంతువుగా వుండిపోవలసిందే. గుండుచేయించు కొని, తెల్లబట్ట కట్టుకొని పట్టుమని పదిసంవత్సరాలుకూడాలేని పాపకూడా మామ్మలాగా బ్రతుకంతా ఆ చనిపోయిన భర్త గురించి స్మరిస్తూ, జీవచ్ఛవంలా గడపవలసిందే. ఆ పాపకు భర్తతో కాపరంచేసే అవకాశం రాకుండానే చనిపోయినా, 'మూడుముళ్ళు' పడ్డాయికనుక, ఇక తన జీవితంఅంతా ఆ ముళ్ళకు కట్టుబడి గడపవల్సిందే.

## పసిపాపలు విధవలయ్యారు!

20వ శతాబ్దంలోను, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, కందుకూరి వీరేశలింగం వంటి సంఘసంస్కర్తలు పూనుకొని వితంతు పునర్వివాహాలకు ముందడుగు వేసేవరకూ, మన దేశంలో లక్షలాది వితంతువులు జీవచ్ఛవాల లాగా, ఇంటిలో చాకిరీచేసే ఒక గొడ్డులాగ తమ కాలం గడుపుతూ వుండవలసి వచ్చింది.

పెరుగుతున్న విశాలభావాలు, పాశ్చాత్యదేశాల ప్రభావంతో బెంగాలులోను, బొంబాయి, మద్రాసు రాష్ట్రాల్లోను సాంఘిక సంస్కరణల ఆవశ్యకతను కొంతమంది గుర్తించారు. సతీసహగమనాన్ని నిషేధింప జేయడానికి రాజారామమోహనరాయ్ ఇంగ్లండులో ప్రీవీ కౌన్సిల్ వరకూ వెళ్ళి, సాధించారు.

బెంగాలులో బ్రహ్మసమాజం ప్రాబల్యం, బొంబాయి, మద్రాసు రాష్ట్రాలలో సాంఘిక సంస్కరణకు సంఘాలు ఎన్నో బయలుదేరాయి. అసలు ఈ సాంఘిక సమస్యలన్నింటికీ మూలమైన స్త్రీల గురించి వీరు ఆలోచించక తప్పలేదు.

బాలికలకు ఇంగ్లీషుచదువు కావాలని, వితంతు పునర్వివాహం కావాలని చెప్పడమేకాక, అసలు ఈ సమస్యలన్నిటికీ మూలమైన బాల్యవివాహాలను నిషేధించాలనికూడా కోరడం ప్రారంభించారు. అయితే సనాతనుల ప్రాబల్యం విస్తృతంగా వుండడంతో ఎన్నో అడ్డంకులను అధిగమించవలసి వచ్చింది.

## సభ్యతకు తలవంపైన మృతి

1889 లో హరిమైతీ అనే వ్యక్తి 10 సంవత్సరాలుకూడానిండని తన భార్య పూల్‌మణితో కాపరం చెయ్యాలన్న ప్రయత్నంలో బల వంతంగా అనుభవించబోయేసరికి ఆమె చనిపోయింది. ఇది సభ్య ప్రపం చానికి తలవంపు కలిగించింది. ఈ కేసు హైకోర్టువరకూ వెళ్ళింది. సోషల్ కాన్ఫరెన్సు, కలకత్తా ఆరోగ్యసంఘం, మనదేశంలో అప్పుడు వున్న 55మంది మహిళాడాక్టర్లు, అన్నితరగతులకు చెందిన బొంబాయి లోని రెండువేలమంది స్త్రీలు ఇంగ్లండులోని విక్టోరియా మహారాణికి బాల్య వివాహాల వలన వచ్చిన ఈ అనర్థం గురించి ఒక వినతిపత్రం సమర్పించారు.

## తనదాకా వస్తే

అయితే. వితంతు పునర్వివాహాలు కావాలనీ, బాల్యవివాహాలు నిషేధించాలని ఉపన్యాసాలు చెప్పేవారు కూడా పాత ఆచారాలకు ఒక్కొక్కసారి బానిసలైపోయి, మొత్తం ఉద్యమానికే దెబ్బకొడుతూ వుండేవారు. బొంబాయి హైకోర్టు జడ్జి, బొంబాయి యూనివర్శిటీ వైస్ చాన్సలర్ అయిన తెలాంగ్ తన పిల్లల పెళ్ళి విషయంవచ్చే వరకు చాలా అభ్యుదయ నాయకునిగా ప్రజలముందు ఉపన్యాసాలిచ్చారు. బాల్యవివాహాలు చేయకూడదని చెప్పిన ఆయనే, 10 సంవత్సరాలు, 8 సంవత్సరాలు వయస్సుగల తన కూతుళ్ళు యిద్దరికీ 1893లో బాల్యవివాహాలు జరిపి మొత్తం ఉద్యమానికే తలవంపు కలుగజేశాడు.

'అతనికంటె ఘనుడు ఆచంటమల్లన్న' అన్నట్లు ఒక సంఘ సంస్కర్తగా పేరు పొందినవ్యక్తి, ఎంతోవయస్సుకూడా వున్న ఆర్. యన్. మధోల్కర్ 12 సంవత్సరాల బాలికను పెళ్ళిచేసుకొన్నాడు.

ఈ విధంగా మాటలు కోటలు దాటినా, కాలు గడపదాటని స్థితి నుండి నెమ్మది నెమ్మదిగా మార్పువైపు పురోగమనం జరిగింది.

## "గ్రుడ్డిలో మెల్ల"

బాల్యవివాహాలను నిషేధించడంలో మైసూరు సంస్థానం కొంత వరకు ముందడుగువేసింది. 8 సంవత్సరాలలోపు ఆడపిల్లలపెళ్ళి చెయ్యకూడదని, 50 సంవత్సరాల మగవాడు 8 సంవత్సరాలపైన వయస్సు అమ్మాయిలనే చేసుకోవచ్చునని శాసించారు. బరోడా సంస్థానంలో ఆడపిల్లకు 12 మగవాడికి 16 ఏళ్ళు పెళ్ళికి వుండాలన్నారు. అప్పుడు అదే పెద్దమార్పు.

సనాతనుల అడ్డంకులు అధిగమనించాలంటే ఇంగ్లండులో ప్రజాభిప్రాయం బాల్యవివాహాలకు వ్యతిరేకంగా కావాలని శ్రీ బి. యం మల్బరీ భావించి అక్కడకు వెళ్ళి ఈ విషయంలో కృషి చేశారు.

1872లో బ్రహ్మసమాజ్ మారేజి ఆక్టు పాస్ అయింది. అయితే, అది వారికిమాత్రమే వర్తించింది. అందరికీ వర్తించే సివిల్ మారేజి ఆక్టు ప్రయత్నాలు తీవ్ర వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది, అయినా ఈ సాంఘికసంస్కరణను సాధించడానికి చట్టానికై కృషి జరుగుతూనే వుండేది.

ఒక ప్రక్క ప్రజాభిప్రాయం అనుకూలంగా కావడంతో 10సంవత్సరాలలోపు బాలికతో, భార్యాభర్తలైనాసరే, శారీరక సంబంధం కూడదని ఇండియన్ పీనల్ కోడ్ నిర్దేశించింది.

## శారదా యాక్టు

1922లో డాక్టర్ హరిసింగ్ గౌర్ వివాహ వయస్సు పెంచాలని కేంద్ర శాసనసభలో బిల్లు పెట్టారు. కాని దానిని తిరస్కరించడం జరిగింది. దానికి కారణం సనాతనుల ప్రాబల్యమే.

మరోప్రక్క అంతర్జాతీయంగా స్త్రీకి మైనారిటీ తీరాలంటే 21 సంవత్సరాలు నిండాలని నానాజాతి సమితి నిర్ణయించింది.

ఈ రకంగా జాతీయంగా, అంతర్జాతీయంగా సంభవించిన పరిణామాలతో చివరకు 1929లో "శారదా ఆక్టు" రూపొందించడం జరిగింది.

శారదా చట్టాన్ని సవరించి వివాహ వయస్సు పెంచుతూ పార్లమెంటు ఈ మధ్యనే బిల్లు ఆమోదించింది. దీని ప్రకారం వివాహం చేసుకోవాలంటే స్త్రీలకు 18 సంవత్సరాలు, పురుషులకు 21 సంవత్సరాలు వయస్సు వుండాలి. ఇది అక్టోబరు 1978 నుండి అమలులోనికి వచ్చింది.

వందలాది సంవత్సరాలుగా వున్న బాల్యవివాహ ఆచారాన్ని చట్టరీత్యా అంతమొందించడమే కాక, విద్యా, ఉద్యోగ రంగాలలో స్త్రీలకు రానురాను అవకాశాలు లభించడంతో ఈ శతాబ్దంలో స్త్రీల పురోభివృద్ధికి తగు అవకాశాలు ఏర్పడ్డాయి. అయితే, అన్నిరంగాలలో సమానత్వానికై ఇంకా ఎంతో కృషి జరగవలసివుంది.



వితంతు వివాహాలకై కృషిచేసిన

# సంఘ సంస్కర్త వీరేశలింగం

సమాజంలో ఏ మార్పు రావాలన్నా—అందులో ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన విషయాలలో మార్పురావాలంటే —ఎన్నో అడ్డంకులను, అవాంతరాలను ఎదుర్కోవలసి వుంటుంది. స్త్రీజాతి సంక్షేమానికై కృషిచేసిన సంఘ సంస్కర్తలందరూ మనదేశంలోని సనాతనుల తీవ్రవ్యతిరేకతను ఎదుర్కోవలసివచ్చింది.

సమాజంలో మార్పు రావాలని బాగా కృషి ప్రారంభమైంది 19వ శతాబ్దంనుండే. సతీసహగమనాన్ని, చిన్నపిల్లల హత్యలను అరికట్టడంతో ఆరంభమైన సాంఘిక సంస్కరణ కార్యక్రమం బెంగాలులో మరింతబల పడి, చిన్నపిల్లల వివాహాలను నిషేధించాలని, వితంతు పునర్వివాహాలకు అవకాశం కావాలనే వరకూ విస్తరిల్లింది.

ఒకప్రక్క బాల్యవివాహాలు, మరోప్రక్క వితంతు పునర్వివాహానికి ఆస్కారం లేకపోవడంతో, లక్షలాదిమంది బాలవితంతువులతో దేశం కళావిహీనం అయిపోయింది, సమాజంలో స్త్రీ పతనావస్థకు అదిచిహ్నం.

## 1856 లో చట్టం

బెంగాలులో ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి సంఘసంస్కర్తల కృషిఫలితంగా 1856 లో వితంతు పునర్వివాహ చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్టం అమలులోకి వచ్చిన మొదటి 5 సంవత్సరాలలో 25 వితంతు పునర్వివాహాలు ఈశ్వర్‌చంద్ర విద్యాసాగర్ పట్టుదలవలన జరిగాయి. 1864-1869 మధ్య బ్రహ్మసమాజం అధ్వర్యంలో 8 పెళ్ళిళ్లు జరిగాయి. మహారాష్ట్రలో మహాదేవ్‌గోవింద్‌రానడే, విష్ణుశాస్త్రి చింప్లూకర్ ప్రోత్సాహంతో 1869లో బొంబాయిలో మొదటి విధవా వివాహం జరిగింది.

దక్షిణాదిన ఈ మార్పు రావడానికి నాయకత్వం వహించింది కందుకూరి వీరేశలింగం. ఇది ఆంధ్రులందరికీ గర్వకారణం. "దక్షిణ హిందూ దేశవిద్యాసాగరుడని" 1898లో రానడే ఆయనను కీర్తించాడు.

వితంతు పునర్వివాహాలకై వీరేశలింగం కృషి అనన్య సామాన్యమైనది. తన సర్వస్వాన్ని ధారపోసి, తానునమ్మిన కార్యక్రమాన్ని జయప్రదం చేయడానికి అహోరాత్రులు కృషిసల్పిన సంఘసంస్కర్త వీరేశలింగం.

1848 ఏప్రిల్ 16న రాజమండ్రిలో ఒక సనాతన కుటుంబములో జన్మించి, చిన్నప్పుడే తండ్రినికోల్పోయి మూఢనమ్మకాలు, జ్యోతిష్యం, భూతప్రేతాలలో విశ్వాసం, మంత్రతంత్రాలతో, ఛాందస భావాలతో పెరిగిన వీరేశలింగం పెద్ద అయి సాంఘిక విప్లవ కారుడు కాగలడని ఎవరూ ఊహించలేదు.

అయినా, జీవితం నేర్పిన పాఠాల అనుభవంతో, మూఢనమ్మకాల ముసుగులో జరిగే మోసాలను గమనించి, స్వంత ఆలోచనతో, విచక్షణా జ్ఞానంతో, కరుడు కట్టిన పాతఆచారాలపై ధ్వజమెత్తిన ధీరుడు వీరేశలింగం.

## 1881 లో మొదటి వితంతు వివాహం

1879 నుండి వీరేశలింగం స్త్రీ పునర్వివాహ సమస్యపై ఉపన్యాసాలిస్తూ ధైర్యంగా ముందడుగువేశారు. సనాతనుల వ్యతిరేకతను గట్టిగా ఎదుర్కొని వాదప్రతివాదాలలో ఓడించారు. 1881 డిశంబరు 11న రాజమండ్రిలో మొట్టమొదటిసారిగా దక్షిణ భారతదేశంలో వితంతు పునర్వివాహాన్ని జరిపించారు. పరీక్ష వచ్చేసరికి అంతవరకూ అభ్యుదయ వాదులము అన్నవారే పెళ్ళికి రావడానికి తటపటాయించారు. వచ్చిన కొందరు తరువాత ప్రాయశ్చిత్తము చేసుకున్నారు. అయినా ప్రతీ మార్పుకూ మొదటి అడుగే పడడంకష్టం. ఆ వరవడిలో తరువాత అడుగులో అడుగువేస్తూ లక్ష్యసాధనకై కృషిచేసేవారు ముందూ వెనుకా బయ

టకు వస్తారు. అందుచేతనే, రెండవ వితంతు వివాహం 4 రోజులలోనే వీరేశలింగం జరిపించారు. ఈ సంఘ సంస్కరణలో వీరేశలింగంకి పూర్తి సహకారం యిచ్చింది విద్యార్థులు. మొదటి వివాహానికి విద్యార్థులకు తోడు 60 మంది పోలీసులు కాపలావుండి సనాతనుల దాడిని తట్టుకోవడానికి సిద్ధమైతే, రెండవ వివాహంలో ఆంగ్లేయ ఉద్యోగులు కూడా వచ్చి పాల్గొని ప్రోత్సహించారు. వీరేశలింగంగారి భార్య రాజ్యలక్ష్మి ఆయన కార్యక్రమము లన్నింటినీ సమర్థించి చేదోడువాదోడుగా నిలిచింది. ఇది ఆయన విజయానికి మరింత తోడ్పడింది.

## మార్పుకు విద్యార్థుల అండదండలు

దీనితో సనాతనులకు గంగవెర్రులెత్తాయి. వీరేశలింగంగారిని, వివాహంలో పాల్గొన్న చాలామందిని శంకరాచార్య స్వాములు వెలివేస్తూ "ఉత్తర్వు" చేశారు. ఆ రోజుల్లో మతాన్ని కాదనడమంటే, శంకరాచార్యుని ఆజ్ఞ ధిక్కరించడమంటే చాలా భయంగా వుండేది. దానితో, కొంతమంది తాము చేసింది పాపమని అంగీకరించి ప్రాయశ్చిత్తం చేసుకున్నారు. మిత్రులు దూరమయ్యారు. అయితే, వీరేశలింగంని అవమానించాలనుకున్న శంకరాచార్యుని శిష్యులను విద్యార్థులు పట్టుకొని "పాదరక్ష ప్రయోగము" చేసి బుద్ధి చెప్పి ఊళ్ళోనుండి తరిమి వదిలిపెట్టారు.

పగపట్టిన సనాతనుల కుతంత్రాలను భగ్నంచేసి 1882లో మూడవ వివాహం జరిపించారు. పెళ్ళికూతురు మైనరని పోలీసురిపోర్టు యిచ్చినా, నిజంగా మైనరు కాకపోవడంతో ఛాందస పండితుల పన్నాగాలు విఫలం కాక తప్పలేదు. ఈ సందర్భంలోనే ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వీరేశలింగం అవిరళకృషికి జోహర్లు అర్పిస్తూ ఉత్తరంకూడా వ్రాశారు.

ఒక్కొక్క విధవావివాహం వీరేశలింగం పోరాటంలో ఒక్కొక్క మైలురాయి. కొన్ని సందర్భాల్లో పురోహితులు పారిపోయారు; మరికొన్ని సార్లు వంటబ్రాహ్మడు పరారీ; మరొకసారి పెళ్ళికొడుకే గల్లంతు; మరి కొన్నిసార్లు పెళ్ళికి వస్తామన్న పెద్దలు పత్తాలేరు. అయినా, మార్పును

అహ్వానించే, అభినందించే అభ్యుదయవాదులైన విద్యార్థులే వీరేశలింగం గారికి గట్టి మద్దతు నిచ్చారు. ఆ విద్యార్థులలో కొందరు యింకా ముందడుగువేసి పెళ్ళిపీటలమీద కూర్చొని 'మూడుముళ్ళు'వేసి సనాతనుల ఆట కట్టించారు. వీరేశలింగం వ్యక్తికాదు, ఉద్యమం అని నిరూపించారు.

## వ్యతిరేకతలమధ్య పురోగమనం

వీరేశలింగం మద్రాసు, బెంగుళూరు, బళ్ళారి, బందరు-యిక్కడా అక్కడా ఏమిటీ, దక్షిణాది అంతా విజయదుందుభి మ్రోగించారు. అయినా వెన్నెముకలేని చదువుకున్నవారు కొందరు వితంతు వివాహం జరిగితే చూడడానికే రావడానికి సాహసించలేక పోయారు. పెళ్లి శుభలేఖలో అభినందనలకు కూడా తమపేరు వద్దన్నారు. పాత ఆచారాలు, సనాతనత్వం, అవకాశవాదం, భీరుత్వంతో "మాటలు కోటలు దాటినా, కాలు గడప దాటక" చతికిలబడ్డ సంఘటనలు కోకొల్లలు.

అయినా, సహాయం సామాన్యులనుండి, అనుకోని మూలలనుండి వస్తూనే వుంటుంది. రైలులో కొంతమంది దిగినా, క్రొత్తవారు ఎక్కుతూ అది గమ్యస్థానానికి ప్రయాణించినట్లు, వీరేశలింగం సంఘసంస్కరణ ఉద్యమంలో పాతవారుపోయినా, క్రొత్తవారు యింకా ఉత్సాహంగా వచ్చారు. 1897లో రాజమండ్రినుండి మద్రాసుకు మకాం మార్చేసరికి రాష్ట్రం నలుమూలలా 27 వితంతు వివాహాలు విజయవంతంగా నిర్వహించారు.

ముఖ్యపట్టణమన్న ఆశతో మద్రాసు మారితే, అక్కడి సంఘసంస్కరణ వాదులు మేడిపండువలె వున్నారని వీరేశలింగంకి చూడగానే తెలిసోయింది. ఎనిమిదిమంది వచ్చిన బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సహపంక్తి భోజనంలో పాల్గొన్న వారుకూడా, అందులో పాల్గొన్నామని బహిరంగంగా చెప్పడానికి భయపడ్డవారే! సనాతనులు వెలి వేస్తారేమోనని చదువుకున్నవారు సైతం ఆనాడు అంత భయపడ్డ సమాజమది!

మద్రాసులో వితంతు వివాహాలకు చందాలివ్వడానికే జంకిన పెద్ద లున్నారు. మద్రాసులో ఒక పెళ్లికి అంతా సిద్ధమైనా చివరిక్షణం పెళ్లి కొడుకు గాయబ్ అవడంతో వివాహం ఆగిపోయింది. ఉద్యమంలో జయాపజయాలు కలుగుతూనే వుంటాయి. 1902లో గుంటూరులో మొదటి విధవా వివాహం ఎంత అల్లకల్లోలమైనా జరిగింది.

1905లో వీరేశలింగంగారు మద్రాసునుండి మరల తిరిగి రాజమండ్రి వచ్చారు. వయస్సు మళ్ళుతున్నా, కార్యదీక్ష తగ్గలేదు. సమాజపరివర్తనా కృషిలో క్రొత్తక్రొత్త రంగాల్లో కృషి ప్రారంభించారు. మహిళల సమస్యలతో ముడిపడిందే అనివాహిత మాతృత్వం కూడా. కొందరు వితంతువులే తల్లులయ్యారు. ఈ సాంఘిక సమస్యా పరిష్కారానికై సమస్యలున్న స్త్రీలకు రక్షణ కల్పించడానికి rescue home ప్రారంభించారు. వారిపిల్లలను పెంచారు.

వీరేశలింగం మొదటినుండీ స్త్రీ విద్యకై అవిరళకృషిసల్పారు. తన పత్రికలు, పుస్తకాలద్వారా విజ్ఞాన బీజాలను వెదజల్లారు.

## వివిధ రంగాలలో మార్పుకై కృషి

ఒక సంఘసంస్కర్తగా వచ్చే సమస్యలన్నీ ఎదుర్కొన్నారు. వీరేశలింగంగారు సంస్కర్తగా కృషిచేస్తూవుంటే తమ వ్యక్తిగత సమస్యల పరిష్కారం వరకూ వచ్చి లాభం పొంది, వితంతు వివాహంచేసుకొని, జీవితంలోస్థిరపడి, తరువాత ప్రాయశ్చిత్తం చేసుకున్నవారూ వున్నారు. ఖర్చులేకుండా, అంతబరువూ మోసి పెళ్ళిచేయమని అడిగిన అవకాశవాదులూవున్నారు. వితంతువుల వివాహం మొత్తం సమాజం మార్పులో ఒక భాగం. యింకా ఎన్నోరంగాలలో మార్పురావాలంటే దానికి చేదోడు–వాదోడు యివ్వకపోయినా, కనీసం అడ్డు పడకూడదన్న జ్ఞానంకూడా లేని వితంతువులూ ఆయనకు ఎదురయ్యారు. అందుచేతనే, 1906లో వీరేశలింగం క్రైస్తవులతోసహా అందరితో కలిసి సమిష్టిభోజనం చేసి,

తరువాత జంధ్యముకూడా తీసేయాలనుకోగానే వీరేశలింగంగారి ఇంట్లో తమ వివాహాలకై వచ్చివున్న యిద్దరు వితంతువులు ఆ ఇల్లువదలి వెళ్ళిపోయారు!

అలాగే, 1908వ సంవత్సరంలో వింతంతువివాహం చేసుకొంటున్న ఒక యువకుడు మార్పును మరింత ముందుకు తీసుకువెళ్ళడానికి తన వివాహ సమిష్టి భోజనంలో "మాలవాని"తో సహా కలసిభోజనం చెయ్యాలని పట్టుబట్టాడు. స్త్రీలు ఈ సమిష్టి భోజనాన్ని వ్యతిరేకించడంతో అప్పుడు అసలు పెళ్ళే ఆగిపోయింది.

యిలాగ అడుగడుగునా అడ్డంకులు ఎదుర్కొంటూ, వీరేశలింగం గారు వితంతు వివాహాలు, స్త్రీ విద్య ప్రోత్సాహంద్వారా యింకా ఎన్నో కార్యక్రమాలు చేపట్టి యితర రంగాలలో కూడా సంఘసంస్కరణకు తగు వాతావరణాన్ని తయారుచేశారు.

సనాతన ఆచారాలపై తిరగబడి సంఘసంస్కరణకు జీవితం ధార బోసిన వీరేశలింగంగారు పూర్తిగా ఆస్తిక సాంప్రదాయాలను వదులుకోలేదు. తనను ఆస్తికులనే అనుకొన్నారు. అయినప్పటికీ, ఆయన పాత ఆస్తిక భావాలపై జరిపిన తిరుగుబాటు తరువాత నాస్తికభావాల వ్యాప్తిని సుగమంచేసింది. సంఘసంస్కర్తగా వీరేశలింగంగారి పేరు ప్రజల హృదయాలలో చిరస్థాయిగా వుంటుంది.



## మతాచారంగా ప్రారంభమై, నిషేధింపబడినా, నేటికీ కొన్నిచోట్ల కొనసాగుతూ

# వ్యభిచారంగా దిగజారిన దేవదాసీ పద్ధతి

మత నమ్మకానికి, వ్యభిచారానికి అవినాభావ సంబంధంవుంది. అంటే కొంతమందికి ఆశ్చర్యం కలగవచ్చు. మతంపేర, దేవునిపేర, మనదేశంలో వ్యభిచారం కొనసాగుతూ వుంది. దేవదాసీ వ్యవస్థ యిందుకు ప్రత్యక్ష ఉదాహరణ. ఈ రోజున దేవదాసీ పద్ధతిని ప్రభుత్వం శాసన రీత్యా నిషేధించి నప్పటికి, యదార్థానికి, ఆచరణలో ఈ పద్ధతి యింకా యిప్పటికీ కర్నాటక, మహారాష్ట్రవంటి రాష్ట్రాలలో కొనసాగుతూనే వుంది. దేవదాసీలుగా జీవితం ప్రారంభించి వ్యభిచారిణులుగా ఊబిలోకి దిగివాడిపోయి, సుఖవ్యాధులతో కృంగి కృశించి నీరసించి పోయే స్త్రీలు ఈనాటికీ ఎంతోమంది వున్నారు. అంటే మతనమ్మకాలు అమాయిక ప్రజల జీవితాలను ఏవిధంగా నాశనం చేస్తున్నదీ స్పష్టం అవుతుంది. ఈరోజుకి బొంబాయి లాంటి పెద్దపట్టణాలలో వ్యభిచారవృత్తిలో ఇరుక్కుపోయి దయినాత్రిదయినం అయిన జీవితం గడుపుతున్న అనేక మంది అభాగ్యులు దక్షిణ భారత దేశంలో వివిధరాష్ట్రాలలో దేవదాసీ పద్ధతి వలన చివరికి వ్యభిచార గృహాలకు చేరినవారేనని సామాజిక శాస్త్రజ్ఞులు జరిపిన వివిధ పరిశోధనల వలన స్పష్టం అవుతోంది.

అసలు ఈ దేవదాసీ పద్ధతి ఎలాగ వచ్చిందీ? అని ముందుగా కొంచెం తెలుసుకోవడం అవసరం.

## కన్యలను దేవాలయాలకు అర్పించే ఆచారం

భారతదేశంలోనే కాక, సుమేరియా, మెసపటోమియా నాగరికత లలోకూడా కొంతమంది స్త్రీలు ఆ దేశాల దేవాలయాలకు దాసీలుగా

ఉండేవారు. దేవాలయాలు నిర్వహించే పురోహితులు భూమిమీద దేవుని ప్రతినిధులుగా భావింపబడేవారు. కనుక దేవుని సేవచేయడం పేరుతో "దైవప్రతినిధులైన," ఈ పూజారుల సేవలోనే జీవితం గడిపేవారు. ఈ విధంగా ఆదాసీలు పురోహితుల ఉంపుడు గత్తెలుగా దిగజారిపోయేవారు. ఇస్తార్ (goddess of Fertility ఆ దాసీలకు ఆరాధ్యదేవతగా వుండేది.

ప్రాచీన నాగరికతలు చాలావాటిలో కన్యలను దేవతలకు అర్పించడం అనే ఆచారం వుండేది. ఈ విధంగా ఆ కన్యలు వ్యభిచారవృత్తిలోకి దింపబడేవారు. ఈ వ్యభిచారం దేవాలయాల ఆవరణలలోనే యదేచ్ఛగా కొనసాగిపోతూవుండేది. మనదేశంలో దేవాలయాలకు కన్యలను అర్పించడం, వారివ్యభిచారం మతంపేరుతో కొనసాగడం అనే ఆచారాన్ని ద్రావిడులు ప్రారంభించారని చరిత్రకారుల భావన. ఈజిప్టు, మెసపటోమియాలలో ఆనాడు ప్రచారంలో వున్న ఈ ఆచారాన్ని ద్రావిడులు అనుకరించి అనుసరించారని భావిస్తారు. మోహంజదారో త్రవ్వకాలలో బయటపడిన నృత్యబాలిక ప్రతిమ ఆనాడు మతం పేరుతో కొనసాగిన వ్యభిచార వ్యవస్థకు ప్రతీక అని కొందరు భావిస్తారు.

## వేదకాలం నుండీ....

ఋగ్వేదంలో నృత్య కన్యల గురించి పేర్కొనడం జరిగింది. నృత్య కన్యలను ప్రాతఃకాల "దేవత" అయిన "ఉషస్సు"తో పోల్చడం కూడా జరిగింది. ఋగ్వేదంలో కర్మకాండలూ పుంశ్చలి, మాగధగురించి పేర్కొనడం జరిగింది. పుంశ్చలి ఆర్యుల కర్మకాండలో పవిత్రమైన వ్యభిచారిణి. మాగధ సంగీతజ్ఞుడైన తిరుగాడే యువకుడి "జైమిని బ్రాహ్మణం" లో మాగధ, పుంశ్చల సమాగం గురించి పేర్కొనడం జరిగింది.

ద్రావిడుల ప్రభావంతో ఇంద్రుడు కళలన్నింటికీ అధిరాజుగా భావింపబడేవాడు. ఇంద్రుని కొలువులో గాంధర్వులు, కిన్నెరలు, అప

రసలు ఉండేవారని కథలు అల్లారు. వేదాల తరువాత యుగంలో సంగీతం నృత్యం దేవుని పూజించడానికి ఒక ప్రధాన సాధనంగా ప్రజలలో ప్రచారం అయింది. ఈనాటికీ దేవదాసీలు తమ కుల దేవత రేణుకను గాంధర్వగా నమ్ముతారు.

ఇక అధర్వణ వేదంలోకి వస్తే "గాంధర్వ గృహితల" గురించి పేర్కొనడం జరిగింది. అంటే వారికి గాంధర్వులు పూనారని అర్థం. భూలోకంలోని అప్సరసలనే ఆ గాంధర్వ గృహితల గురించి కీర్తించారు. ఈ గాంధర్వ గృహితలు పెళ్ళి చేసికోవడానికి వీలులేదు. దేవుళ్ళను— మొగవాళ్ళను, తమ గాన మాధుర్యంతో, నృత్యంలో ఆనందపరచడమే. వారిని తృప్తిపరచడమే వారి జీవిత పరమావధి అని నిర్ణయించారు. లేని దేవుని పేరుతో పురుషుల సౌఖ్యానికి వారు ఉపయోగపడ్డారు.

పురాణ గాధల ప్రకారం ఇంద్రుడు పతనమైన స్త్రీలను దేవాలయాలకు అంకితం అవమని కోరాడని, ఈ విధంగా తమ వ్యభిచార వృత్తిని కొనసాగిస్తూ దేవాలయాలకు సేవ చేయవచ్చునని గాధలు అల్లారు.

ఆర్యులు తమ బానిసల స్త్రీలను వ్యభిచారానికి వినియోగించేవారు. కౌటిల్యుని "అర్థశాస్త్రం"లో కూడా దేవాలయ వ్యభిచారిణులు "నృత్య కత్తెలుగా" పేర్కొనడం జరిగింది. వయస్సు మీరిపోయిన వ్యభిచారిణులకు నూలు నేతలాంటి వృత్తులు ఆకాలంలో కల్పించేవారు.

దేవదాసీల గిరాకీ, ఔన్నత్యం దక్షిణ భారతదేశంలో పల్లవ చోళ రాజుల కాలంలో జరిగింది. క్రీస్తు తరువాత ఆరవ శతాబ్దం నుండి 13వ శతాబ్దం వరకూ పల్లవ, చోళ రాజులు విపరీతంగా దేవాలయాలు నిర్మించారు. దానితో దేవదాసీల ప్రాధాన్యత కూడా పెరిగింది. ఈ విధంగా దేవాలయ నిర్మాణానికి-దేవదాసీ పద్ధతి వ్యాప్తికి అవినాభావ సంబంధం వుంది.

## దేవాలయ నిర్మాణానికి, దేవదాసీకి ముడి

దేవాలయాలలో డాన్సర్లుగా రూపొందిన ఈ స్త్రీలను "రుద్రగణికలు" అని, "దేవరాదియల్" అని "దేవదాసి" లని వివిధపేర్లతో పిలిచేవారు. ఈ దేవదాసీలకు చిన్నవయస్సులోనే దేవాలయాల్లోని దేవతలతో పెళ్ళి జరిపించేవారు. దేవతావిగ్రహంతో అ దేవదాసీలకు పెళ్ళి అయిందని గుర్తుగా అ దేవాలయ పూజారి అ అమ్మాయి మెడలో "మంగళసూత్రం" కట్టడమే కాక పూలదండ వేయడం, భుజాలకు ముంచి గంధం వ్రాయడం చేసేవారు.

అసలు చిన్న ఆడపిల్లలు దేవదాసీలుగా మారడానికి చాలా కర్మకాండ ఆకాలంలో జరిగేది. అ పిల్లలకు నృత్యం, సంగీతం, సాహిత్యం నేర్పేవారు. 7 సంవత్సరాలు నేర్చుకొన్న తరువాత "గజ్జెపూజ" జరిగేది. ఇక అక్కడ నుండి గజ్జెకట్టడం జరిగేది.

నృత్యకర్త్రిగా ఆమె తన నైపుణ్యాన్ని రాజులముందు, ప్రదర్శించి రంగప్రవేశం చేసేది.

## దేవదాసీ వ్యవస్థ

దేవదాసీ వ్యవస్థ వంశపారంపర్యంగా కొనసాగేది. దేవదాసీలకు భూములు యిచ్చేవారు. కొంతమందికి రాజులు "ఇనాం" కూడా యిచ్చేవారు.

దేవదాసీలకు పెళ్ళి కాకపోయినా, వాళ్ళకు పుట్టిన పిల్లలకు సామాజిక గౌరవం లభించేది. అవివాహిత మాతలకు పుట్టినపిల్లలను చిన్నచూపు చూసినట్లు దేవదాసీ పిల్లల్ని కించపరచేవారుకాదు. దేవదాసీపద్ధతి ఆనాటి సామాజిక వ్యవస్థలో ఒక భాగమైంది. వారిలో స్త్రీలకే ఎక్కువ విలువ. దేవదాసీల ఆడపిల్లలు మరల దేవాలయాలకు అంకితం చేయబడి తల్లి అడుగు జాడలలో మరల సంగీతం, నృత్యంలో ప్రావీణ్యం సంపాదించి పెరిగి పెద్దవారై తల్లివృత్తిని చేపట్టి దేవదాసీలయ్యేవారు. ఇక మొగ

పిల్లలు అంటూరా, వాళ్ళ ఇంటిలో వున్న సంగీత, నృత్య వాతావరణం వలన సాధారణంగా సంగీతజ్ఞులుగా, వివిధ వాయిద్యాలు వాయించడంలో నిపుణులుగా రూపొందేవారు.

## రోజులు మారాయి

కాని ,రోజులు మారాయి. రాజులు, రాజ్యాలు అంతరించాయి. జమిందారుల జమిందారీలు పోయాయి. ఒకనాడు రాజాశ్రితులుగా వున్న దేవదాసీలు, చివరకు బజారునపడ్డారు. "దేవుని దాసీలుగా" భావింప బడిన ఈ దేవదాసీలు మారుతున్న సాంఘిక, ఆర్థిక పరిస్థితుల వలన డబ్బు ఎవరుయిస్తే వారికి తమ శరీరాన్ని అమ్ముకునే స్థితికి దిగజారిపోవలసి వచ్చింది.

19వ శతాబ్దంలోనే సంఘ సంస్కర్తల దృష్టి సాంఘిక దురన్యాయాలవైపు ప్రధానంగా పడింది. ఒక ప్రక్క సాంఘిక కురీతులకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని తయారుచేయడం, మరోప్రక్క వీటిని అంత మొందించడానికి, శాసనాలు రూపొందించడానికి ప్రయత్నించడం జరిగింది. రాజారామమోహన్‌రాయ్ వంటి మహనీయుల కృషి ఫలితంగా సతీ సహగమన దురాచారాన్ని చట్టరీత్యా నిషేధించడం జరిగింది. ఈశ్వర చంద్ర విద్యాసాగర్, కందుకూరివీరేశలింగం వంటి సంస్కర్తలు వితంతు పునర్వివాహానికి మార్గం సుగమం చేశారు. కార్వే వంటివారు స్త్రీ విద్య కొరకు కృషి సల్పారు. బాల్యవివాహాల క్రూర ఆచారాన్ని అంత మొందించి బాలికల శారీరక, మానసిక వికాసానికి అవకాశం కల్పించ డానికి రామ్‌విలాస్ శార్దా వంటివారు చట్టంచేయడానికి తోడ్పడ్డారు.

ఈ శతాబ్దంలోనే దేవదాసీ వ్యవస్థ హేయమైన ఆచారం అన్న భావం బలపడింది జాతీయోద్యమంతో పాటు సాంఘిక చైతన్యం వెల్లి విరిసింది. మహాత్మాగాంధీ స్త్రీని విలాస వస్తువుగా దిగదార్చే దేవదాసీ వ్యవస్థ అంతంకావాలనీ సమాజంలో స్త్రీకి సమున్నత స్థానం కల్పించాలనీ కోరారు. 1920లోనే గాంధీజీ వ్యభిచారం వదిలిపెట్టి వాళ్లు మామూలుగా

వివాహాలు చేసుకొని సంఘ సంస్కరణకు కృషిచేయాలని కోరారు. ఈ విధంగా జాతీయోద్యమం, సంఘసంస్కరణ ఉద్యమాలు మిళితమై ఏకోన్ముఖంగా దేవదాసీ పద్ధతిని అంతమొందించి ఆ స్త్రీలను సమాజంలో గౌరవప్రదమైన స్థానం కల్పించాలని కృషి ప్రారంభం అయింది.

## దేవదాసీల విముక్తికి చట్టాలు

సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా మొట్టమొదటి సారిగా The Bombay Devadasi Protection Act 1934లో ఆనాటి మహారాష్ట్ర, గుజరాతు రాష్ట్రాలకు వర్తిస్తూ రూపొందించడం జరిగింది. అదే విధంగా 1947 ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో Madras Devadasi (Prevention of Dedication) Act, 1947 దేవదాసీ పద్ధతిని నిషేధించింది. ఈ రకంగా హేయమైన ఈ సాంఘిక దురాచారాన్ని అంతమొందించాలని ప్రయత్నం జరిగింది.

## ఉత్తరప్రదేశ్ సమస్య

దక్షిణ భారతదేశంలో దేవదాసీ పద్ధతి వ్యభిచారానికి దారితీసినట్లే ఉత్తరప్రదేశ్‌లోని పర్వతప్రాంత జిల్లాల్లో అంటే ఉత్తరప్రాంతంలో వ్యభిచారం కొన్ని కులాలలో వంశపారంపర్య వృత్తిగా మారింది. ముఖ్యంగా నాయక్ కులంలో స్త్రీలు వ్యభిచారాన్నే తమ జీవనోపార్జన సాధనంగా, వృత్తిగా భావించడంచేత పెండ్లి చేసుకోరు. ఆ స్త్రీలే కుటుంబాన్ని పోషిస్తూ ఉంటారు. నాయక్ స్త్రీలంతా వ్యభిచారంలోకి దిగిపోవడంతో నాయక్ పురుషులు ఇతరకులాల స్త్రీలను పెండ్లాడవలసి వస్తోంది. నాయక్ స్త్రీలలో ప్రబలంగా వున్న ఈ నైతిక పతనాన్ని అరికట్టడానికి 1929లోనే ఉత్తర ప్రదేశ్ లో U.P. Naik Girls Protection Act చేసి నాయక్ కుల బాలికలు వ్యభిచారం వృత్తిగా స్వీకరించకుండా ఆపడానికి ప్రయత్నాలు జరిగాయి.

## కేవలం చట్టాలు సమస్యలు పరిష్కరించవు

అయితే, సాంఘిక సమస్యల పరిష్కారం కేవలం చట్టాల ద్వారానే సాధ్యంకాదు. చట్టాలు మార్పు కొరకు కృషి చేసేవారికి చేయూతనిస్తాయి. సాంఘిక సమస్యల పరిష్కారం ప్రజలకు నచ్చచెప్పడం ద్వారా, నిరంతర కృషిద్వారా ప్రజాభిప్రాయాన్ని సమీకరించడం ద్వారానే సాధ్యం. అందుచేతనే దేవదాసీ పద్ధతిని నిషేధిస్తూ, ఆడపిల్లలను దేవాలయాలకు అంకితము యివ్వడం తప్పని ప్రభుత్వం శాసించినా, నాయక్ స్త్రీలను వ్యభిచారం చేయరాదని నిర్దేశించినా, ఈనాడు చాలా ప్రాంతాలలో దేవదాసీ వ్యవస్థ అంతరించినా, యింకా కర్నాటక, మహారాష్ట్రలలో దేవదాసీ వ్యవస్థ లోపాయికారీగా కొనసాగుతూ, ఆ విధంగా కొంతమంది స్త్రీలను మత ఆచారం పేరుతో చివరికి వ్యభిచార వృత్తిలోకి దిగజార్చడం జరుగుతూ వుంది. బొంబాయిలోని వ్యభిచార గృహాల్లో నూటికి 60 మంది వరకు దేవదాసీ వ్యవస్థవలన వ్యభిచారులుగా మారినవారేనని వివిధ సర్వేలలో వెల్లడయింది. ఈ విధంగా కాలం చెల్లిన మతాచారాలు స్త్రీలను అధోగతి పాలు చేయడానికి యింకా ఏవిధంగా తోడ్పడుతున్నాయో అర్థం అవుతుంది.

## "ఎల్లమ్మ దేవత" తో పెళ్ళి

ఈనాటికీ కర్ణాటక రాష్ట్రంలో దేవదాసీల దేవత "ఎల్లమ్మ" కిచ్చి పిల్లల్ని పెళ్ళి చేయడం ఆచారంగా వుంది. ప్రతి సంవత్సరం మూడు, నాలుగువేల మంది కన్యలకు "ఎల్లమ్మతో" వివాహం జరగడం, వాళ్ల చివరికి వ్యభిచారవృత్తిలోకి దింపబడి బొంబాయిలోని వ్యభిచార గృహాలకు చేరడం జరుగుతూవుంది.

అయితే ఈ "ఎల్లమ్మ" దేవత ఎవరు? ఆ దేవతతోనే దేవదాసి "పెళ్ళి" ఎందుకు చేస్తారు అన్న ప్రశ్న వస్తుంది. "ఎల్లమ్మ" అనేపదం "ఎల్లేరమ్మ" అన్న కన్నడ పదంలో నుండి వచ్చింది. అంటే దాని అర్థం

"జగన్మాత" అని. దేవదాసీల ఆదిదేవత "రేణుక" విగ్రహ రూపంలో వున్న దేవతే ఎల్లమ్మ అని దేవదాసీల నమ్మకం. ఎల్లమ్మ వెనకబడ్డ కులాల దేవత.

దేవత ఎల్లమ్మతో దేవదాసీ పెళ్ళి వింతగా కనిపిస్తూ వుంటుంది. దేవదాసీలు తమను పురుషునిగా భావించుకొంటారట.

## విగ్రహాలకిచ్చి పెళ్ళి చేయడం నేరం

కర్నాటకలోని సౌందట్టివద్ద ఎల్లమ్మ కొండవుంది. అక్కడ ప్రతీ సంవత్సరం వందలాదిమంది దేవదాసీలు మార్గశీష పండగ సందర్భంలో జేరి, తమచేతి గాజులను పగలకొట్టుకొంటారు. నుదిటిమీద కుంకుమ బొట్టు చెరిపేసుకొంటారు. ఆరోజునే "ఎల్లమ్మ" భర్త చనిపోయాడని గాథ. కనుక, ఆ నమ్మకంతో అలా చేస్తారట.

కర్నాటకలోని సౌందట్టిలో జరిగే ఉత్సవాలలోనే ఎంతో మంది కొత్త బాలికలకు ఎల్లమ్మ దేవతతో "పెళ్ళి" చేసి ఆ విగ్రహానికి అర్పిస్తారు. దానితో ఇక ఆ ఆడపిల్లలు పెళ్ళిచేసుకొనే హక్కు కోల్పోయి దేవదాసీలుగా మారి వ్యభిచారిణులుగా తమ జీవితం గడుపుతారు. దేవదాసీ రక్షణ చట్టం ఈ రకంగా కన్యలను దేవతా విగ్రహాలకు యిచ్చి "పెళ్ళి" చేయడం నిషేధించింది. అయినా దేవదాసీలుగా ఈనాటికీ వందలాది మంది లోపాయికారిగా మారుతూవున్నారు. దీనిని బట్టి మత నమ్మకాలు మనిషిని ఎలాగ పతనం చేస్తాయో అర్థం అవుతుంది.

1909వ సంవత్సరంలోనే అప్పటి మైసూరు ప్రభుత్వం దేవదాసీ పద్ధతిని నిషేధించింది. అయినా దేవదాసీ పద్ధతి ఏదో ఒక రూపంలో కొనసాగుతోంది. తిరువాన్కూరు సంస్థానం కూడా దేవదాసీ పద్ధతిని నిషేధించింది. 1930లో గోవాలో The Shens Vidhi Prevention Act అని చట్టాన్ని చేసి దేవదాసీ పద్ధతిని నిషేధించింది.

## ఆర్థిక - సాంఘిక కారణాలు

ఈ రకంగా దేవదాసీ పద్ధతిని అంతమొందిస్తూ చట్టాలు చాలా వున్నాయి. మరి ఇంకా ఎందుకు ఈ ఆచారం కొనసాగుతూవుంది? దానికి కారణం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో దేవదాసీ పద్ధతి మతంతో ముడి పడి వుండటమే.

మూఢనమ్మకాలు, చదువులేకపోవడం, ఇతర ఆర్థిక అవకాశాలు తగినంతగా లభించకపోవడం, దళారులు చేసేమోసం, స్త్రీని తేలికగా విలాస వస్తువుగా మార్చుకొనుటకు మతం ముసుగులో దేవదాసీ పద్ధతి వీలుగావుండడం, స్త్రీలకు తగినంత సాంఘిక చైతన్యం లేకపోవడం రాజకీయ పార్టీలు రాజకీయ నాయకులదృష్టి సాంఘిక సమస్యల పరిష్కారం వైపు లేక పోవడం—ఇలాగ ఎన్నో కారణాలు ఈనాటికీ దేవదాసీ పద్ధతి కొన్ని ప్రాంతాలలో కొనవూపిరితో కొనసాగడానికి వీలు అవుతోంది.

ప్రజలలో విజ్ఞానం పెరగాలి, చైతన్యం పెంపొందాలి. స్త్రీలు విలాసవస్తువులుకారని, వారికీ వ్యక్తిత్వం వుందని, మానవత్వ చైతన్యం పెంపొందాలి ఇలాంటి మార్పు పూర్తిగా రావాలంటే దేవదాసీ పద్ధతి పోవాలంటే మతంపోవాలి. మతంపోతే మతనమ్మకాలు, వాటిమీద ఆధార పడి వున్న యితర వ్యవస్థలూ పటాపంచలు కాగలవు.

సమాజం ఎంతత్వరగా ఆర్థిక సాంఘిక సమానత్వంవైపు పురోగమిస్తే అంతత్వరగా మతం ముసుగులో కొనసాగుతున్న దేవదాసీ ఆచారాల లాంటివి అంతం కాగలవు.

# వితంతు వివాహాలు ప్రోత్సహించి, మహిళా యూనివర్శిటీని స్థాపించిన ప్రముఖ విద్యావేత్త 'భారతరత్న' కార్వే

అతిసాధారణంగా జీవితం ప్రారంభించి, అడుగడుగునా జీవితంలో వివిధరంగాలలో పోరాడుతూ, జీవితాంతం 106 సంవత్సరాల వయస్సులో కూడా విద్యా వ్యాప్తికి తన జీవితం అంకితంచేసి, సమాజ పరివర్తనకై అహర్నిశలు కృషి సల్పిన గొప్పవ్యక్తి ధోండో కేశవ్ కార్వే.

సంఘ సంస్కరణకు అహర్నిశలు పోరాడి, తన ఆశయాలు ఆచరించిచూపి తాను వితంతు వివాహం చేసుకొనడమేకాక, వితంతు వివాహాలను విరివిగా ప్రోత్సహించి, స్త్రీలు తమకాళ్ళమీదతాము నిలబడా లని, విద్యా వుద్యోగావకాశాలు కావాలని మనదేశంలో మొట్టమొదటి సారిగా స్త్రీలకు ప్రత్యేక యూనివర్శిటీని స్థాపించి ప్రపంచ ఖ్యాతి నార్జించిన ధీరుడు కార్వే. తాను ప్రారంభించిన చిన్న చిన్న కార్యక్రమాలు మొలక లెత్తి పుష్పించి, ఫలించడం, ఎంతో మంది స్త్రీలు సామాజిక బంధనాలను, పాత ఆచారాలను అధిగమించి విద్యారంగంలో ముందడుగు వేయడం కార్వే కళ్లారా చూశాడు.

ఈ విద్యావేత్తను, సంఘ సంస్కర్తను మన ప్రభుత్వం అత్యున్నత గౌరవమైన "భారతరత్న"తో సత్కరించింది. ఎన్నో యూనివర్శిటీలు గౌరవ డాక్టరేట్లు యిచ్చి తమను తాము గౌరవించు కొన్నాయి. 1958లో కార్వే శతజయంతిలో ప్రధాని నెహ్రూ స్వయంగా పాల్గొని, కార్వేపట్ల దేశానికి గల గౌరవ ప్రతిష్టలను ప్రదర్శించారు.

దేశంలో అత్యున్నత గౌరవాలను అందుకొన్న "భారతరత్న" "మహర్షి" కార్వే 1858 ఏప్రెల్ 18న మహారాష్ట్రలోని మురుడ్‌లో

జన్మించారు. ఒకప్పుడు గొప్పగా బ్రతికిన కుటుంబం అయినా, కార్వే జన్మించే సమయానికి తల్లిదండ్రుల ఆస్తి హారతికర్పూరంలాగా హరించి పోయింది. అందుచేత జీవితంలో నిమ్నోన్నతాలను చవి చూచి, కష్ట సుఖాలు కావడి కుండలని భావించి స్వయంకృషిలో కష్టపడి ధైర్యంగా ముందుకు సాగి చివరకు ఎంతో ఖ్యాతి పొందిన వ్యక్తి కార్వే.

కార్వే అనేది కుటుంబంపేరు. అసలు పేరు ధోండో. తండ్రి పేరు కేశోపంత్. తల్లి లక్ష్మీబాయి. తన స్వగ్రామమునుండి చాలా దూరము నడిచివెళ్ళి సతారాలో ఆరవతరగతి పరీక్ష వ్రాద్దామని వెళ్ళితే సన్నగా, పీలగా వున్న కార్వేను చూచి యితను చిన్నవాడని పరీక్షకు కూర్చోనివ్వ లేదు. 17 సంవత్సరాల వయస్సులో ఇంగ్లీషు చదవడం ప్రారంభించాడు. రత్నగిరి నడచివెళ్ళి స్కూలులో చేరాడు. నెలకు 2రూపాయల స్కాలర్ షిప్ దొరికితే అతని ఆనందానికి అవధులు లేకపోయాయి. కాని అనారోగ్యం కారణం వలన చదువు స్వస్తి చెప్పవలసివచ్చింది.

అయినా విద్యా తృష్ణ అతన్ని నిద్రపోనివ్వలేదు. అడ్డంకులను దాటుకుంటూ, 1881లో బొంబాయిలో మేథమెటిక్స్‌తో బి ఏ. పాసయ్యాడు. తండ్రి మధ్యలో చనిపోయినా, పట్టుదలతో బొంబాయిలోనే ఎం ఏ. పాసయ్యాడు. గోపాలకృష్ణ గోఖలే, తరువాత ప్రఖ్యాత లాయరయిన చిమన్‌లాల్ సెతల్వాడ్ వంటి వారితో యూనివర్శిటీలో కలసి చదువు కున్నాడు.

కార్వేవివాహం చిన్నవయస్సులోనే రాధాబాయితో జరిగింది. చిన్నపిల్లల పెళ్ళిళ్లు ఆనాటి ఆచారం మొదటి నుండే సంఘ సంస్కరణ అభిలాష గల కార్వే తన భార్యకు, చెల్లెళ్ళకు చదువు చెప్పడం ప్రారం భించారు. ఇది ఆ కాలంలో చాలా పెద్దవింత ఆడపిల్లలు వంటఇంటివరకే పరిమితమని, చదువు అనేది పురుషలక్షణం అని భావించేవారు. కాని, ఇది తప్పు అనీ, స్త్రీలు-పురుషులూ అందరూ చదువుకోవాలనీ, అజ్ఞానంపోయి విజ్ఞానం, వికాసం కలగాలంటే విద్య అందరికీ రావాలని కార్వేకు చిన్నప్పటినుండీ ప్రగాఢ విశ్వాసం.

ఏ మార్పు అయినా ఇంటిలో నుండి ప్రారంభం అయితే అది గట్టిగా వుంటుంది. అందుకే కార్వే తన పని భార్యా, చెల్లెలు చదువుతో ప్రారంభించాడు. తను పనిచేసే స్కూలులో పేద విద్యార్థులు కొందరిని తన ఇంట్లోనే ఉంచుకొనేవాడు. తన భార్య రాధాబాయి విశాలభావంతో వారిని ఆదరించేది.

చక్కని జంటగా వున్న కార్వే దంపతుల జీవితంలో విషాదఘట్టం వచ్చింది. తనకు తోడు నీడ అయిన భార్య అనారోగ్యంతో హఠాత్తుగా మరణించింది. బొంబాయిలో ఉన్న కార్వేకు మూడురోజుల అనంతరం ఈ దారుణవార్త అందింది. ఆమె జ్ఞాపకార్థం 500 రూపాయలతో స్కాలర్ షిప్పులను పేదవిద్యార్థులకు కార్వే ఏర్పాటుచేశాడు. స్త్రీ విద్యకు మరింత కృషిచేయాలని దృఢ సంకల్పుడయ్యాడు. తన భార్యను పూర్తిగా చదివించలేకపోయినా, సమాజంలో అణగారివున్న తక్కిన స్త్రీలను చదివించడం ఎలాగా అని ఆలోచించడం ప్రారంభించాడు కార్వే.

19వ శతాబ్దం భారతదేశ చరిత్రలో ఒక ప్రధా ఘట్టం. రాజా రామమోహనరాయ్, బెంటింక్ తో ఆరంభమైన సంఘసంస్కరణ ఉద్యమం క్రమక్రమంగా బెంగాలులో, మహారాష్ట్రలో అన్నిరంగాలలో విస్తరించడం ప్రారంభం అయింది. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంటి మహనీయుల కృషి చదువుకున్న వారిని స్త్రీల సమస్యల వైపు ఆకర్షించింది.

అభ్యుదయ భావాలు గల యువకుడైన కార్వేపై సమకాలీన సమాజంలో పొడచూపుతున్న నూతన ధోరణుల ప్రభావం ప్రబలంగా పడింది. తాను విద్యార్థిగా బొంబాయిలో వున్నప్పుడే స్త్రీలకష్టాలను వర్ణిస్తూ మరాఠీపత్రిక "కేసరి" లో పడ్డ గేయం కార్వే మనస్సుపై చెరగని ముద్రవేసింది స్త్రీల కష్టాలు, ముఖ్యంగా బాలవితంతువుల బాధల గాధలు అతనిని కలచివేశాయి

కార్వేకు నరహరపంత్ అనే స్నేహితుడు. వుండేవాడు అతని ముగ్గురు చెల్లెళ్లకూ ముక్కు పచ్చలారని బాలికలగానే అనాటి ఆచారం

ప్రకారం వివాహం అవడం ముగ్గురూ బాల వితంతువులు కావడం అందమైన జడతో అన్ని అలంకరణలూ చేసుకోవలసిన ఆ ఆడపిల్లలు ఆచారంగా బోడిగుళ్లు చేయించుకోవలసి రావడం జరిగింది. వారి జీవితం పుష్పించి ఫలించకుండా మొగ్గలోనే త్రుంచివేసినట్లు అయింది.

స్త్రీ విద్యకై కంకణం కట్టుకున్న సంఘసంస్కర్త పండిత రమాబాయి బొంబాయిలో స్థాపించిన శారాదా సదన్‌లో కార్వే ప్రోత్సాహంతో బాలవితంతువైన తన చెల్లెల్ని నరహరిపంత్ చేర్చాడు. అది చాలా పెద్దమార్పు. పండితరమాబాయి అక్కడి స్త్రీలలో క్రొత్త స్ఫూర్తిని, చదువు ఎడల ఆకాంక్షను పెంచి మోడువారిన ఆ బాలవితంతువుల జీవితాలలో క్రొత్త ఆశలను, లక్ష్యాలను చిగురింప జేసింది. జీవితానికి ఒక లక్ష్యం ఆ విదుషీమణి వారిముందు వుంచింది.

## వితంతు వివాహం చేసుకొన్న కార్వే

పూనాలోని ఫెర్గూసన్ కాలేజీలో ప్రొఫెసరైన కార్వేకు తానెందుకు విధవావివాహం చేసుకోకూడదు అనిపించింది. ఇతరులకు చెప్పేముందు తానే చేస్తే స్త్రీవిద్యను, వారి జీవితసమస్యల పరిష్కారానికి కొంతైనా చేయూతనిస్తానుగదా అనుకొన్నాడు, కాలేజీ ప్రొఫెసరయిన తనకు ఎన్నో మంచి సంబంధాలు వచ్చాయి. అయినా అవి అన్ని కాదని తాను నమ్మిన సిద్ధాంతంకొరకు 1893లో కార్వే పండిత రమాబాయి దగ్గర ఆశ్రమంలోవున్న నరహరిపంత్ చెల్లెలు గోధూబాయిని వివాహమాడాడు. ఈ వితంతు వివాహానికి ఫెర్గుసన్ కాలేజీ ప్రిన్సిపల్ స్వయంగా అధ్వర్యం వహించాడు. వివాహానంతరం గోధూబాయి పేరు ఆనందాబాయిగా మారింది. మోడు వారిన జీవితం తిరిగి చిగురించింది గదా.

## కుటుంబం నుండి వెలి

పూనాలో కార్వే—ఆనందబాయి వివాహం ఘనంగా 40 మంది మిత్రుల సమక్షంలో జరిగింది, కాని, కార్వే స్వగ్రామంలో మాత్రం ఈ

వివాహం పెద్దకల్లోలాన్ని సృష్టించింది. "బోడెమ్మకు మళ్ళీ పెళ్లా? ఏమి పోయే కాలం. అవ్వా!" అని ముక్కు మీద వేలు వేసుకొన్నారు. అంతేకాదు, ఆనందబాయి, కార్వే మురుడ్ గ్రామానికి వెళ్ళితే సామాజిక బహిష్కరణ చేశారు. ఇక కార్వే బ్రాహ్మణుడే కాదని, సనాతన ఆచారాలను మంట గలిపాడని, నిందించి, ఎవరి ఇంటిలోకీ వాళ్ళని రానివ్వకూడదని గ్రామపెద్దలు హుకుం జారీ చేశారు. కార్వేఅన్న వాళ్ళని రానిస్తే "నీఅంతుచూస్తాం, నిప్పుకీ నీరుకీ వెలి" అని భయపెట్టారు. దానితో కార్వే కన్నతల్లి, అన్నయ్య కూడా కార్వే దంపతులను యింటిలోకి రానివ్వలేదు. చివరకు తన స్వగ్రామంలో ఒక పశువుల పాకలో కార్వే దంపతులు వున్నారు. అమ్మలక్కలంతా దూరంనుండి వారి పాక వైపు తొంగిచూస్తూ "బోడిముండకాపురం" అని ఆడిపోశారు.

తన స్వగ్రామమైన మురుడ్‌కి, తన బంధువులకూ తనకూ ఉన్న సంబంధం తెగిపోయిందని కార్వే అర్థం చేసుకున్నాడు. తాను నమ్మిన సిద్ధాంతాలకు జీవితం అర్పించాలని, పాతనమ్మకాలపై, ఆచారాలపై రాజీలేని పోరాటం కొనసాగించాలని కార్వే ధృఢచిత్తుడయ్యాడు. ఆనందబాయి అతనికి తోడుగా నిలిచింది.

పూనా తిరిగివచ్చారు సంఘసేవ చేయాలంటే స్వతంత్రంగా జీవించాలని నిశ్చయించారు. కార్వే ఆనందబాయిని మిడ్‌వైఫ్ ట్రైనింగ్ కొరకు సంవత్సరంపాటు నాగపూర్ పంపించాడు.

## వితంతు పునర్వివాహ సంఘ స్థాపన

కార్వే వితంతు వివాహ సంఘాన్ని 1893లో ప్రారంభించాడు. వితంతు వివాహాలు చేసుకున్నవారు దానిలో సభ్యులు. ఒకరోజు జీతం దానికి విరాళం యివ్వాలని కోరారు. ఆ సంఘం తరఫున వారు వితంతు వివాహం చేసుకున్న దంపతుల పిల్లలకు హాస్టలు ప్రారంభించారు. కార్వే యింట్లోనే హాస్టలు ప్రారంభం అయింది.

వితంతు వివాహాలను సమర్థిస్తూ కార్వే దేశంలో వివిధప్రాంతాలు పర్యటించాడు. 1895లో ఈ సంస్థ పేరు వితంతు వివాహాల అడ్డంకులను తొలగించే సంస్థ అని మార్చారు.

వితంతు వివాహాలను ఎన్నో అడ్డంకులున్నాయని, ముఖ్యంగా మత సమ్మకాల అభ్యంతరం చాలా తీవ్రమైనదని కార్వే గుర్తించారు. అందుచేత వితంతు వివాహాలకు అనుకూలంగా ప్రజాభిప్రాయం పెంపొందించడానికి పూనుకొన్నాడు. వితంతువులు మళ్లీ పెళ్లి చేసుకొంటే క్రైస్తవులు అయిపోతారని, వితంతువులు చదువుకొంటే కొంప మునిగిపోతుందని సనాతనులు జనాన్ని భయపెట్టేవారు.

1887లో బెంగాలులో బాబూ శ్రీపాదబెనర్జీ "వితంతువులగృహం" (Home for widows) ప్రారంభించాడు. ఆంధ్రలో వీరేశలింగంగారు అలాంటి కార్యక్రమాన్నే చేపట్టారు. వీటి గురించి విన్న కార్వే 1896లో "అనాధ బాలికాశ్రమం" హింగ్నేలో ప్రారంభించారు. పూనా నుండి రోజూ పట్టుదలతో నడిచివెళ్ళి ఆ ఆశ్రమం నిర్వహణ కార్వే చూశారు

కార్వే తన అనుభవంలో స్త్రీ విద్యనూ - వితంతు పునర్వివాహాన్ని కలపగూడదని గ్రహించాడు. వితంతు వివాహానికి తీవ్రమైన వ్యతిరేకత వుండేది. తాను రెండూ చేస్తున్నా, వితంతువుల చదువుకే ప్రాధాన్యత యిచ్చారు. ఈ విధంగా వితంతువులు చదువుకొని తమ కాళ్ళమీద తాము నిలబడితే, వారిలో కొందరైనా వితంతు పునర్వివాహానికి ముందుకు రాగలరని కార్వే ఆశించారు.

## చింత చచ్చినా పులుపు చావలేదు!

అందుచేత అనాధ బాలికాశ్రమం పనికి తాను అంకితమయ్యాడు. సంవత్సరాలు దొర్లుతూ వుంటే రాజులు, గవర్నర్లు, మంత్రులు, మహాత్మాగాంధీ—అందరూ వచ్చి తన కృషిని చూచి మెచ్చుకున్నారు.

చాలా కాలం కార్వేను బహిష్కరించిన కుటుంబం చిట్టచివరకు సంవత్స రాలు గడిచాక ఈ అనాథ ఆశ్రమం వచ్చి చూశారు. అందుకు కార్వే చాలా ఆనందించారు. కాని, విచిత్రం! అప్పుడు కూడా కార్వే తల్లి, అన్న గారు కార్వే యింట్లో మాత్రం అడుగుపెట్టలేదు, ఎందుచేత? కార్వే వితంతువుని వివాహం చేసుకొన్నాడని! చింత చచ్చినా, పులుపు చావలేదు!

బాలికాశ్రమంలో మొదట వితంతువులనే చేర్చుకొన్నా, తరువాత వివాహం కానివారినికూడా చేర్చుకొన్నారు. 18 సంవత్సరాల వయస్సు వరకూ పెళ్లి చేసుకోకూడదని, అంతవరకూ చదువుకోవాలని అందులో నియమం వుండేది.

1907లో కార్వే మహిళా విద్యాలయాన్ని ప్రారంభించాడు. 1914లో కార్వే ఉద్యోగం నుండి రిటైర్ అయి పూర్తిసమయం మహిళా విద్యకు అర్పించారు.

## 1916లో మహిళా యూనివర్సిటీ

1916లో స్త్రీ విద్యా వ్యాప్తికై భారతదేశంలో మొట్టమొదటి మహిళా యూనివర్సిటీని కార్వే ప్రారంభించాడు. విఠల్‌దాస్ థాకర్సీ అనే బట్టల మిల్లుల యజమాని తన తల్లి పేర యూనివర్సిటీకి 15 లక్షలు విరాళమిచ్చాడు. దానితో దానికి S.N.D.T. Women University అని పేరు వచ్చింది. కార్వే కృషివల్ల 50 సంవత్సరాలలో ఎన్నో మహిళా సంస్థలు, కాలేజీలు ప్రారంభించబడి అవి ఈ యూనివర్సిటీకి అనుబంధం చేయబడ్డాయి.

ఈ మహిళా యూనివర్సిటీ ఎంట్రెన్సు పరీక్షలు నాలుగు భాషలలో జరిగేవి: మరాఠీ, గుజరాతీ, సింధీ, తెలుగు. తెలుగుతప్ప తక్కిన మూడు భాషలలో యూనివర్సిటీ కాలేజీలలో విద్యాబోధనా జరిగేది.

ఈ యూనివర్శిటీకి గవర్నమెంటునుండి గుర్తింపు మొదట్లో లేదు. అందుచేత యూనివర్శిటీ అంతా పూర్తిగా ప్రజా సహకారంమీదనే నిర్వహింప బడేది.

1928లో 71సంవత్సరాల వయస్సులో మొట్టమొదటి సారిగా కార్వే యూరప్, అమెరికా, జపాన్ పర్యటనకు పదమూడున్నర మాసాలు వెళ్ళి వివిధ దేశాలలో విద్యాసంస్థలలో తాను స్థాపించిన మహిళా యూనివర్శిటీ గురించి, స్త్రీ విద్యాభివృద్ధి గురించి ఉపన్యాసాలు యిచ్చాడు. 1930లో మరల ఆఫ్రికాఖండం పర్యటనకు వెళ్ళి 15 నెలలు పర్యటించి వచ్చాడు.

కార్వే ఆఫ్రికా పర్యటననుండి తిరిగివచ్చేసరికి క్రొత్త సమస్యలు ఎదురయ్యాయి. యూనివర్శిటీకి అంతవరకూ తోడ్పడుతున్న బట్టల మిల్లుల యజమాని మరణించడంతో, ఆయన అనంతరం సాలీన 52 వేల రూపాయలు సహాయం చేయడానికి నిరాకరించడం జరిగింది. ఈ వివాదం కారణంగా యూనివర్శిటీ మూత పడకుండా లెక్చరర్లు అందరూ తమ జీతాలను స్వచ్ఛందంగా దాదాపు సగానికి తగ్గించుకున్నారు. ఇది వారి త్యాగనిరతికి, కర్తవ్య దీక్షకు నిదర్శనం. చివరికి ఆ ట్రస్టులో రాజీ జరిగింది. అయితే, దాని ప్రకారం యూనివర్శిటీని హింగ్నేనుండి బొంబాయికి మార్చవలసి వచ్చింది

గ్రామాలలో విద్యావ్యాప్తి జరపాలని 80 సంవత్సరాల వయస్సులో పథకాలు చేపట్టాడు. 104 సంవత్సరాల వయస్సులో వయోజనవిద్యా ప్రచారానికి పూనుకున్నాడు. ఈ రకంగా నిరంతర పురోగామిగా తన జీవితం కొనసాగించాడు.

1942లో సమానత్వం కావాలనే లక్ష్యంతో "సమతాసంఘం"ను స్థాపించి "మానవీయ సమత"అనే పత్రికను నిర్వహించాడు.

కార్వే శతజయంతి ఉత్సవాలు ఎంతో ఘనంగా జరిగాయి వయస్సు పెరుగుతున్నా, సమానత్వం కావాలని స్త్రీలలో విద్యావ్యాప్తి

జరగాలనీ, దేశ భవిష్యత్తు స్త్రీలచైతన్యం —సమానత్వంపైనే ఆధారపడి వుందని కార్వే గట్టిగా భావించాడు.

కార్వే కృషి వివిధరంగాలలో విజయవంతం అవడానికి భార్య ఆనందబాయి చేదోడు వాదోడుగా విశాల దృక్పథంతో తోడ్పడింది. 57 సంవత్సరాలు కలిసి జీవించిన ఆ దంపతులకు వియోగం 1950లో కలిగింది. 86 సంవత్సరాల వయస్సులో ఆనందబాయి మరణించింది.

106 సంవత్సరాల వయస్సులో కార్వే చివరివరకు సక్రియంగా ఉండి 1962 నవంబరు 7న మరణించాడు.

మానవ కర్తృత్వానికి ప్రతీకగా కార్వే నిలిచాడు. సామాన్యంగా జీవితం ప్రారంభించి స్వయంకృషితో దీక్షతో, సోదరభావంతో, సమానత్వం సాధించాలని, దీక్షతో కార్వే జీవితాంతం ముందుకు సాగాడు. గతిశీలి, ప్రగతిశీలి అయిన కార్వే జీవితం ఎంతో మందికి స్ఫూర్తినిచ్చి కర్తవ్యోన్ముఖులను చేస్తుంది.



## సతీసహగమన దురాచారాన్ని అంతమొందించిన

# ప్రథమ సంఘ సంస్కర్త రాజా రామమోహనరాయ్

భారతదేశంలో సతీసహగమన దురాచారాన్ని అంతమొందించడానికి అనవరతం కృషిసల్పి హిందూమతాచారాలలో మార్పులు తీసుకువచ్చి, మతంలో విప్లవానికి నాందిపలికి, మహిళాభ్యుదయానికి, సమ

సమాజనిర్మాణానికి మార్గం సుగమంచేసిన ప్రముఖ సంఘ సంస్కర్త రాజారామమోహనరాయ్. పాశ్చాత్య దేశాలలో పెరుగుతున్న సైన్సు-టెక్నాలజీ భారతదేశంలోకూడా పెంపొందాలని, కాలం చెల్లిన పాత ఆచారాలను, బూజుపట్టిన పాతభావాలను వదిలిపెట్టి పాశ్చాత్య విద్యను, విజ్ఞానాన్ని భారతీయులుకూడా నేర్చుకోవాలని, నవసమాజ నిర్మాణంలో ముందడుగువేయాలని, మానవతాదృక్పథాన్ని అలవరచుకోవాలని 19వ శతాబ్దం ప్రారంభంలోనే రాజారామమోహనరాయ్ జాతిని ఉద్బోధించాడు.

## నవయుగ వైతాళికుడు

సనాతన ఛాందస మతవాదులనుండి తనకు ఎదురైన సవాళ్లను ధైర్యంగా, ఒంటరిగా ఎదుర్కొని, తానునమ్మిన సిద్ధాంతాలకొరకు జీవితాంతం కృషిసల్పి భారతీయులలో విశాలభావాలు, సమతాదృక్పథం, ఆలోచనా శక్తి పెంచాలని విరామమెరుగని పురోగమనంలో ముందుకు సాగి దేశవిదేశాలలో నూతన భావబీజాలు వెదజల్లి, జాతీయతకు, ఆత్మ గౌరవానికి, అంతర్జాతీయదృష్టికి, శాస్త్రీయదృక్పథానికి అంకురార్పణ చేసిన వ్యక్తి రాజారామమోహనరాయ్. విశిష్ట వ్యక్తిత్వంగల రామ్మోహనరాయ్ నవయుగ వైతాళికునిగా కీర్తింపబడ్డాడు. బహుముఖ ప్రజ్ఞావంతుడు.

## 1772లో బెంగాలులో జననం

రాజారామమోహనరాయ్ తాతముత్తాతలు బెంగాలు నవాబువద్ద ముఖ్యమైన పదవును నిర్వహించారు. తండ్రి రామ్‌కాంతరాయ్‌కూడా సంపన్నుడు, కీర్తిప్రతిష్టలు కలవాడు. బర్ద్వాన్ జిల్లాలో రాధానగర్‌లో (యిప్పుడు హుగ్లీజిల్లా) 1772లో రామమోహనరాయ్ జన్మించాడు. సనాతన ఆచారాల నిలయమైన ఆ కుటుంబంలో తండ్రి వైష్ణవుడు, తల్లి శైవురాలు. చిన్నతనంలో గ్రామపాఠశాలలో చదువుకున్న అనంతరం ఇస్లాం సంస్కృతికి నిలయమైన పాట్నాకు వెళ్లి అక్కడ ఫారసీ, అరబిక్ నేర్చుకొన్నాడు. తరువాత కాశీ వెళ్లి సంస్కృతం చదివాడు, 12 సంవత్సరాల వయస్సులోనే సన్యాసం స్వీకరించాలని అభిలషించాడు.

దేశాటనలో టిబెట్ కూడా వెళ్లి వచ్చాడు. అప్పటికి అతను 14 సంవత్సరాల బాలుడే. తల్లి పట్టుదల వలన సన్యాసం స్వీకరించకుండా ఆగిపోయాడు.

## బహుభాషా కోవిదుడు

కాని, ఒకప్రక్క పారసీక, అరబిక్ భాషల అధ్యయనం, మరో ప్రక్క సంస్కృతం చదవడం వలన విశాలభావాలు పెరిగి అప్పుడు బాగా ప్రచారంలోవున్న విగ్రహపూజ తప్పుఅని గట్టి నిశ్చయానికి వచ్చాడు.

కాశీలో సంస్కృతంలో పాండిత్యం సంపాదించి 1794లో తిరిగి బెంగాలువచ్చి ఈస్టు ఇండియా కంపెనీలో వివిధజిల్లాల్లో ఉద్యోగం చేశాడు. ఇంగ్లీషు కూడా బాగా చదివాడు. 1800సంవత్సరంలో కలకత్తాలో ఫోర్ట్ విలియం కాలేజీ ప్రారంభం కాగానే దానితో సంబంధాలు పెంపొందించుకొని, మరింత విస్తృతంగా ఇంగ్లీషు చదివాడు. బైబిలు చదవడానికి హీబ్రూభాష నేర్చుకొన్నాడు. గ్రీకు భాషను కూడా అధ్యయనం చేశాడు. ఈ విధంగా బహు భాషా కోవిదుడయ్యాడు. 1815–20 సంవత్సరాలలో 14 పెద్ద పుస్తకాలు వ్రాశాడు వాటిలో 10 ఇంగ్లీషులోను, 4 బెంగాలీలో ప్రచురించాడు. వేదాంతాన్ని ఇంగ్లీషులోకి మొట్టమొదటిసారిగా అనువదించాడు.

శీరాంపూర్‌లోని క్రైస్తవ మిషనరీలతో కూడా సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి. క్రీస్తుపై ఒక పుస్తకాన్నికూడా వెలువరించాడు. మొదట క్రైస్తవ మిషనరీలు సన్నిహితంగా రామమోహన్‌రాయ్‌తో వున్నా, మతాంతీకరణను ఆయన వ్యతిరేకించడంతో కొంతమంది క్రైస్తవ మిషనరీలు దూరంఅయ్యారు. అయినప్పటికీ, రాంమోహన్‌రాయ్ ప్రఖ్యాతి యూరపు, అమెరికాలలో విస్తృతంగా వ్యాపించింది.

## సర్వతోముఖ ప్రతిభ

రాజా రాంమోహన్‌రాయ్ సర్వతోముఖ ప్రతిభ కలిగిన వ్యక్తి. బెంగాలీలో వచన రచనలు, పత్రికలను ప్రారంభించాడు. సంఘటిత కృషి

ద్వారానే మార్పు సాధ్యం అని సంఘాలను స్థాపించాడు.

రామమోహన్‌రాయ్ నవసమాజ నిర్మాణానికై విగ్రహారాధనను అంతమొందించాలని, ప్రజలను చైతన్యవంతులను చేయాలని బ్రహ్మసమాజాన్ని ప్రారంభించాడు. బ్రహ్మసమాజాన్ని ఒకమతశాఖగా కాక, సంకుచితదృక్పధంకాని మతసంస్కరణ ఉద్యమంగా 1828లో రూపొందించాడు. ఆనాటిసమాజంలో మతంలో విప్లవం సాధించడానికి అదొక ముందడుగు.

మతంలో మార్పు తీసుకువచ్చి, సనాతనుల దుష్కృత్యాలను అంతమొందిచాలని, ప్రజలలో సైన్సు శాస్త్రీయదృక్పధం వ్యాప్తి చెయ్యాలని, మూఢనమ్మకాలు తీసివేయాలని, సమాజాన్ని క్షాళన చెయ్యాలని పూనుకున్నాడు.

## సంఘ సంస్కరణకు ముందడుగు

తన 40వఏట ఉద్యోగానికి స్వస్తిచెప్పి కలకత్తా చేరుకొన్నాడు తనజీవితాన్ని సంఘసేవకు అర్పించాలని నిశ్చయించుకొన్నాడు. అన్ని భాషలలోనూ మతగ్రంధాలు క్షుణ్ణంగాచదివిన రామమోహన్‌రాయ్ హిందూ మతంలో విప్లవానికి, సంఘ సంస్కరణకు నడుంకట్టాడు. సతీసహగమన దురాచారం, సమాజంలో స్త్రీకిగల హీనస్థితి అతనిని కలచివేశాయి.

సతీసహగమన దురాచారాన్ని మాన్పించడానికి ఒక వైపు ప్రజాభిప్రాయాన్ని రూపొందిస్తూ మరోప్రక్క ప్రభుత్వశాసనం ద్వారా దానిని పూర్తిగా నిషేధింపజేయాలని నడుంకట్టాడు.

## ప్రాచీన కాలంనుండీ సతి

సతీ సహగమనం అనే ఆచారం ప్రాచీనకాలం నుండీ వుంది. భర్త లేదా కుటుంబయజమాని మరణించినప్పుడు భార్యగాని, తల్లిగాని, ఉంపుడుగత్తెగాని, బానిసలుగాని సహగమనం చేసేఆచారం వుండేది. "సతి"

అనేపదం సంస్కృతంలోని "సత్యవ్రత" నుండి వచ్చింది. దాని అర్థం స్త్రీ తనభర్తతో పాటు చితిపై మరణించడం. దీనినే 'సహమరణం' అని కూడా అనేవారు. భర్త ఏక్కడో చనిపోతే ఆ వార్త విని మరోచోట భార్య చితిపై దూకి మరణిస్తే దానిని "అనుగమన" అనేవారు.

సతీసహగమనంలాంటి ఆచారం మనదేశంలోనేకాక పూర్వకాలంలో గ్రీకులలో, స్లావ్‌లు, ఇతరజాతులలో ఉన్నట్లు కనబడుతుంది. అయితే, ఇదివరలో రాజకుటుంబాలకు, ఆ స్థాయివారికి పరిమితమై వుండేది.

## సతీదురాచారం ఎప్పుడు వచ్చింది?

మన దేశంలో వేదకాలంలో సతీసహగమనం వున్నట్లు ఆ గ్రంథాలలో ఆధారంలేదు. భర్త చనిపోయినతరువాత భార్యకూడా సహగమనంచేసే ఆచారం క్రీస్తుకు పూర్వం కొన్ని శతాబ్దాల ముందు ప్రారంభం అయిందని కొందరి అభిప్రాయం. "Life and Conditions of People of Hindusthan" లో కె యం అష్రాఫ్ సతీసహగమనం బహుశః భారతదేశంలో ఒక పురాతన కొండజాతి ఆచారం కావచ్చునని పేర్కొన్నాడు. ఆర్యులు దానిని అనుకరించి వుండవచ్చునని అతని భావం.

సతి అనే దురాచారం మనదేశంలో ప్రారంభం అయిందా లేదా విదేశాల ప్రభావంతో ప్రారంభం అయిందా అన్నదానికి తగు ఆధారాలు లేవు. విష్ణుపురాణంలో మినహాయించి ఏధర్మ శాస్త్రంలోనూ సతిగురించి ప్రస్తావన లేదు. శిలాశాసనాల ఆధారంగా చూస్తే క్రీస్తుతరువాత 510లో ఒక స్త్రీ సతీసహగమనం చేసిందని ఒక శాసనంద్వారా తెలుస్తుంది. అయితే ఆరోజుల్లో సతి అనేది బాగా ప్రచలితమైన ఆచారంకాదు. మధ్యయుగాలలోనే సతీసహగమనం ఒక ఆచారంగా ప్రబలింది. మహమ్మదీయ దండయాత్రలు పెరిగాక, తమ గౌరవాన్ని కాపాడుకోవడానికి భర్తతో పావకమే మేలుఅని, లేకపోతే తమజీవితం వారిచేతులలో దుర్భరం కావచ్చునని స్త్రీలు భావించినట్లు కనబడుతుంది. సహగమనం చేసిన స్త్రీలగురించి

సమాధులమీద పేర్లు చెక్కేవారు. అది ఒక గొప్పతనంగా మారింది. మార్వార్ రాజు అజిత్‌సింగ్ చితిపై అతని అరుగురు భార్యలు, 58 మంది ఉంపుడు కత్తెలు సతీసహగమనం చేశారని చరిత్రకారుడు కల్నల్‌టాడ్ "Annals and Antiques of Rajasthan" లో పేర్కొన్నాడు. బుండీరాజు బుధ్‌సింగ్ చితిపై 48మందికి పైగాస్త్రీలు సహగమనంచేశారట.

## చితిపై ఎక్కకపోతే సాంఘిక వెలి

సతిఅనేది రాజకుటుంబాలకే పరిమితం కాలేదు. బ్రాహ్మణులు, రాజపుత్రులు, యితర పైకులాలకు చెందినవారు సతిని అనుసరించారు. రాజస్థాన్‌లో వివిధ స్వదేశ సంస్థానాలలో ఈ దురాచారం ఎక్కువగా వుండేది. భర్తతో చనిపోవడం స్త్రీకిగౌరవంఅనీ, అది మంచిదనీ, భర్త చనిపోగానే కొంతమంది పూజారులు నూరిపోసి సహగమనానికి సిద్ధం చేసేవారు

సతి ఒక సాంఘిక దురాచారంగా మారిపోయింది. యిష్టంఉన్నా లేకపోయినా స్త్రీభర్తతో పాటు చితిపైఎక్కి చావవలసిందే. లేకపోతే ఆమెను రాసిరంపాన పెట్టేవారు. దానిని భరించలేక సహగమనమే హాయి అని స్త్రీలు అనుకునేవారు. ఒక స్త్రీ సహగమనం చేయనిరాక రించినందుకు గాను, సాంఘిక వెలి భరించలేక బాబిలోనియాకు పారిపోయి వచ్చిందని డాక్టర్ అష్రాష్ తన పుస్తకంలో పేర్కొన్నాడు.

## మతాచారంగా మారింది

మహమ్మదీయులు అధికారం హస్తగతం చేసుకున్న తరువాత సతీ సహగమన దురాచారం హిందూవులలో మరింత పెరిగింది. ఢిల్లీసుల్తానులు, అక్బర్, జహంగీర్, ఔరంగజేబు అందరూ సతిని ఆపాలని ప్రయత్నిం చినా ఆ దురాచారం యధాతంగా కొనసాగింది. మహమ్మదీయ ఆఫీసర్ల నుండి సతికి పర్మిషను తీసుకోవాలని నియమంవుండేది. అయినా పర్మిషను అందరికి యిచ్చేవారు. సహగమనం హిందూమతంలో భాగంగా మహమ్మ

దీయులు భావించారు కనుక, హిందువుల ఆచార వ్యవహారాలలో, అవిఎంత అమానుషంగా వున్నా, కల్పించుకొనేవారు కాదు.

## కందిరీగల తుట్టి అని భయం

మనదేశంలో బ్రిటీషువారు అడుగుపెట్టినప్పటినుండీ, ఉంగ్లేయులు ఈ హేయమైన ఆచారం గురించి పేర్కొంటూనే వున్నారు. కొన్ని సతి సంఘటనలు కళ్ళకు కట్టినట్లు వర్ణించారు. ప్రభుత్వం ఈ హేయమైన, అనాగరిక కృత్యాన్ని నిషేధించాలని వారు కోరారు అయితే హిందూ సాంప్రదాయాలలో, మతవిషయంలో జోక్యం చేసుకునట్లు అవుతుందని అధికారులు వెనుకాడారు. సతీసహగమనం నిషేధిస్తే, కందిరీగ తుట్టె కదిపినట్టయి, తమకే హిందువులు ఎసరు పెడతారేమోనని, తమమనుగడకే ముప్పువస్తుందని, భారతీయులంతా తమపై తిరగబడతారని రకరకాలుగా బ్రిటీషువారు భయపడ్డారు. అందుకే మతాచారాలలో జోక్యం చేసుకోరాదని పైఅధికారులు వారికి ఉత్తర్వులిచ్చారు.

సతీసహగమనం ఉత్తరహిందూస్థానంలో వివిధ ప్రాంతాలలో ప్రచారంలో వుండేది బెంగాలులోనే కాక, రాజస్థాన్‌లోని వివిధ స్వదేశ సంస్థానాలలోకూడా సతీసహగమన దురాచారం నిరాటకంగా సాగిపోయేది. స్త్రీభర్తతోపాటు చనిపోవడానికి సిద్ధపడితే సరేసరి, లేదా సామాజిక కట్టుబాటుక్రింద బలవంతంగానైనా పట్టుకొని చితి ఎక్కించేవారు.

## కొన్ని సంస్థానాలలో నిషేధం

కొంతమంది రాజులు స్వదేశ సంస్థానాలలో మానవతా దృక్పథంతో సతీసహగమనాన్ని నిషేధించారు. రాజపుత్ర రాజులయిన జయపూర్ మహారాజా సాయై ప్రతాప్‌సింగ్ (17 8–180?) జోధ్‌పూర్ మహారాజా భీమ్‌సింగ్ (1793–1803), బుండీమహారాజు బీషన్‌సింగ్ హేయమైన సతిని తమ స్వదేశ సంస్థానాలలో నిషేధించారు.

స్వదేశ సంస్థానాలలోని కొందరు బ్రిటీషు పొలిటికల్ ఏజంట్లు సతిని మాన్పించడానికి కృషి సల్పారు. 1818 నుండి 1822 వరకూ మేవార్, హరౌటీలో బ్రిటీషు ప్రతినిధిగా వున్న కల్నల్‌టాడ్ దీన్ని మాన్పించడానికి చాలా కృషిచేశాడు. బుండీమహారాజు రావ్ బీషన్‌సింగ్ మరణించినప్పుడు అతని రాణులు సతీసహగమనం చేయకుండా నిరోధించ గలిగాడు. కాని, అన్నిచోట్ల అతనికి విజయం లభించలేదు. బజోలాలో సతీసహగమనాన్ని కల్నల్‌టాడ్ ఆపలేక పోయాడు.

బ్రిటీష్ ఇండియాలో సతిని 1832లో నిషేధించినా కొన్ని స్వదేశ సంస్థానాలలో ఈ హేయమైనపద్ధతి కొనసాగుతూనే వచ్చింది. 1838లో మహారాజా జలాన్‌సింగ్ మరణానంతరం. యిద్దరు రాణులు, ఆరుగురు చెలికత్తెలు అతనిచితిపైపడి సహగమనంచేశారు. ఈవిధంగా రాజస్థాన్‌లో వివిధప్రాంతాలలో ఎన్నోసార్లు సతీసహగమన దురాచారం 19వ శతాబ్దం మధ్య వరకూ కొనసాగుతూనే వచ్చింది.

## సతి నిషేధానికి సిద్ధంకాని ప్రభుత్వం

బ్రిటీషుఇండియాలో సతీసహగమనాన్ని మాన్పించడానికి 18వ శతాబ్దంలోనే కొందరుఆఫీసర్లు ప్రయత్నించారు. అప్పటి బెంగాలురాష్ట్రం లోని షాహాబాదులో ఆ జిల్లా కలెక్టరు యం. హెచ్. బ్రూక్స్ 1789లో స్వయంగా పూనుకొని సతీసహగమనాన్ని నిరోధించాడు. కాని బెంగాలు ప్రభుత్వం ఆ పనిని హర్షించలేదు. బలవంతంగా సతీసహగమనాన్ని ఆపవద్దని, నచ్చచెప్పటం వరకే చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. హిందూమత విషయంలో జోక్యం చేసికొనరాదని ప్రభుత్వం అభిమతం. వెల్లస్లీనుండి మొయిలావరకూ గవర్నర్ జనరల్స్ ఇదే విధానాన్ని అనుసరించారు.

1803లో విలియం కేరీ అనే క్రైస్తవ మిషనరీ సహగమన దురాచారం కలకత్తా చుట్టుపట్ల ఎలాగవుందో లెక్కలు సేకరించి లార్డ్ వెల్లస్లీకి సమర్పించారు. కలకత్తా చుట్టుప్రక్కల 1803లో 438 సతీసహ

గమనాలు, 1804లో 300 జరిగాయని తేలింది. ఇంత దారుణంగా పరిస్థితి వున్నా బ్రిటీషు ప్రభుత్వాధికారులు జోక్యం కలిపించుకొనుటకు సాహసించలేదు, సతిని మతాచారంగానే భావించి చూసి చూడక ఊరుకోవడం జరిగింది. కాని సతి తప్పు అన్న భావం కొందరిలో రావడం ప్రారంభించింది.

## తన వదిన సహగమనం కలచివేసింది

రాజారామమోహనరాయ్ సతీసహగమన దురాచారానికి వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభించాడు. తాను ఒక్కడైనా మొక్కవోని ధైర్యంతో, తదేక దీక్షతో ముందుకుసాగాడు.

రాజారామమోహనరాయ్‌ను తనకుటుంబంలో తనఅన్నజగన్మోహన్ చనిపోయినప్పుడు తన స్వంతవదినే సహగమనంచేయడం కలచివేసింది. సహగమనం చేయవద్దని రామమోహనరాయ్ ఎంతో బ్రతిమిలాడాడు. ఆమె దృక్పథంలో మార్పు వచ్చి సహగమనం మానివేద్దామని ఆమె అనుకొంటున్నా బలవంతాన బంధుమిత్రులు ఆమెను అన్నచితిపైకిఎక్కించిని, ఆమె వద్దని అరుస్తున్నా పెద్ద వెదురు బొంగులతో అదిమిపట్టి, నొక్కి సతీసహగమనం చేయించారు. ఆమె అరుపులు, పెడబొబ్బలు అక్కడ వాయిస్తున్న డప్పులు శబ్దంలో లీనమైపోయాయి. ఆమె అగ్నికి ఆహుతి అయిపోయింది క్రూరమైన ఈసాంఘిక దురాచారం స్త్రీ మారతానన్నా, మారనివ్వకుండా, భర్త చనిపోతే బ్రతకడానికి కూడా స్వేచ్ఛలేకుండా చేసింది ఈ భయానక దృశ్యం రామమోహనరాయ్ హృదయం కలచివేసింది. మతంపేరుతో, మతాచారాలపేరుతో, సాంఘిక కట్టుబాట్ల పేరుతో కొనసాగుతున్న అతి ఘోరమైన ఈ సాంఘిక దురాచారాన్ని అంతమొందించాలని రామమోహనరాయ్ ప్రతిన పూనాడు. తన అనన్య సామాన్య వాదనా పటిమతో, ఈ ఆచారానికి జీవం పోస్తున్న సనాతునలను చీల్చి చెండాడాలని నిశ్చయించుకొన్నాడు. మతగ్రంధాలను, శాస్త్రాలను సనాతన ఛాందస పండితులు తప్పుగా వ్యాఖ్యానిస్తూ సతీసహగమనాన్ని సమర్థిస్తు

న్నారని, యిది ఆచారమేతప్ప, హిందూశాస్త్రసమ్మతం కాదని సనాతనులపై ధ్వజమెత్తాడు.

సనాతనులు సతీసహగమనాన్ని హిందూ మతంలో భాగంగా చిత్రీకరించబట్టి 1812 డిశంబరు 5న ప్రభుత్వం సతిని మతానికి అనుగుణంగా వున్నంతవరకూ చట్టసమ్మతమేనని ప్రకటించింది. మతంతో సంబంధంలేకుండా జరిగే సతిని మాత్రమే ప్రభుత్వం నిషేధించానంది. ఈవిధంగా హిందూ పండితులు యిచ్చిన వ్యాఖ్యానం ప్రకారం సతీ సహగమనాన్ని రెండుగావిభజించి "చట్టసమ్మతమైన" సతి ఆచారంగానూ, "చట్టసమ్మతంకాని" సతి నేరంగాను ప్రకటించింది. అంటే శాస్త్రాలకు అనుగుణంగా సతీసహగమనం జరుగుతూ వుందా, లేదా అని నిర్ణయించ వలసిన బాధ్యత పోలీసు ఆఫీసర్ల మీద వుంచారు. అంటే పరోక్షంగా సతీ సహగమనాన్ని సమర్థించినట్లే అయింది.

సతీసహగమనం జరిగేటప్పుడు పోలీసు అధికారి అక్కడకు వెళ్ళి అంతా సక్రమంగా వుందా లేదా అనిచూడాలి. చట్టసమ్మతంకాని సతీ సహగమనం అంటే ఆ అమ్మాయికి 16ఏళ్ళలోపు వయస్సు వుండరాదు, లేదా గర్భవతి కాకూడదు, లేదా మాదక ద్రవ్యాల ప్రభావంలో వుండ కూడదు. అలావుంటే సతిని ఆపాలి. లేకపోతే సతి చట్టబద్ధం అయినట్లే

## పెరిగిపోయిన సతీసహగమనాలు

ఈరకంగా 1812లో ప్రభుత్వం నిర్ణయించిన విధానం సతీ సహగమనాన్ని ఆపేబదులు, మరింత ప్రోత్సహించినట్లయింది. ఇదివరకు మానవతాదృక్పథంతో కొందరు సతీసహగమనాన్ని ఆపడానికి కొంతైనా ఆస్కారంవుండేది. ఇప్పుడు పోలీసుల రక్షణ సనాతనులకు లభించడంతో సహగమనం నిరాటంకంగా, "చట్టబద్ధంగా" ప్రబలిపోయింది.

సతీసహగమనాలు ఎలాగ పెరిగి పోయాయో ఈ క్రింది పట్టిక చూస్తే స్పష్టం అవుతుంది:

| సంవత్సరం | | అధికారరీత్యా ప్రకటింపబడిన సతీసహగమనాలు |
|---|---|---|
| 1815 | .... | 378 |
| 1816 | .... | 412 |
| 1817 | .... | 707 |
| 1818 | .... | 839 |
| 1819 | .... | 650 |
| 1820 | .... | 598 |
| 1821 | .... | 653 |
| 1822 | .... | 583 |
| 1823 | .... | 575 |
| 1824 | .... | 572 |
| 1825 | .... | 639 |
| 1826 | .... | 518 |
| 1827 | .... | 517 |
| 1828 | .... | 463 |

వీటిలో అయిదింట మూడువంతులు కలకత్తా చుట్టుప్రక్కల జరిగినవే. అధికారికంగా ఇన్ని సహగమనాలు జరిగితే, ఇక గ్రామాలలో ప్రభుత్వం దృష్టికి రాకుండా మరెన్ని సహగమనాలు జరిగాయో ఊహించవచ్చు.

## సనాతనులను ఎదుర్కొన్న రాయ్

అంటు జాడ్యంలా వ్యాపించిన ఈ సాంఘిక దురాచారం స్త్రీల అస్థిత్వానికే ప్రమాదం కల్పించింది. గవర్నమెంట్ మెత్తదనం గమనించిన సనాతన ఛాందసులు 1817లో ప్రభుత్వానికి ఒక మహజరు సమర్పిస్తూ, సతి మతసంబంధమైనది కనుక, ప్రభుత్వం ఏవిధంగా జోక్యం చేసుకోరాదని, యదేచ్ఛగా సహగమనం పేరుతో స్త్రీలను తగుల

బెట్టడానికి స్వేచ్ఛ కావాలని కోరారు. దానితో రామమోహనరాయ్ అతని మిత్రులు ఈ దారుణాన్ని అరికట్టాలని నడుంకట్టి కదనరంగంలో దిగారు. సహగమన దురాచారాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ, స్త్రీలను ఏవిధంగా బలవంతంగా "సతి" పేరున హత్య చేస్తున్నదీ బయటపెట్టారు. కాళ్ళు-చేతులుకట్టి చితిపై పడేసి వెదురు బొంగులతో నొక్కిపట్టి తగులబెట్టడం మానవత్వానికే కళంకమని, అపచారమని, స్త్రీకి ఆస్తి వారసత్వ హక్కు లేకపోబట్టి ఈదురాచారం కొనసాగుతూవుందని, చట్టరీత్యా నిషేధించడం దానితో పాటు బలమైన ప్రజాభిప్రాయమే దీనిని ఆపగలదని ఎన్నో కరపత్రాలద్వారా, పుస్తకాలద్వారా రామమోహనరాయ్ ప్రచారం చేశాడు.

సనాతనుల పిటీషనును వ్యతిరేకంగా మరో పిటీషను తాను ప్రభుత్వాకి సమర్పించాడు. సతి శాస్త్ర సమ్మతం కాదని సోదాహరణంగా పేర్కొన్నాడు. దానితో పెద్ద దుమారం రేగింది సనాతనులు అతనిపై కత్తికట్టారు. ప్రభుత్వంలోకూడా భిన్నాభిప్రాయం వచ్చింది. హోరాస్ విలియమ్స్ సతి హిందూమతంలో భాగమని, శాస్త్రసమ్మతమని వాదించాడు. ప్రభుత్వం సేకరించిన సమాచారం ప్రకారం 1815 నుండి 1818 మధ్య 2365 మంది సహగమనం చేశారని, వారిలో 1528 మంది కలకత్తా పట్టణంలోనే సతి పేరుతో నిప్పులతో కాల్చబడ్డారని తేలింది. రామమోహనరాయ్ విజిలెన్స్ కమిటీలు ఏర్పరిచాడు.

## సాధించిన విజయం

ఊగిసలాడుతున్న ప్రభుత్వం విలియం బెంటింక్ గవర్నరు జనరల్ కావడంతో రాజారామమోహనరాయ్ ప్రారంభించిన ఉద్యమం ఫలితంగా చివరికి సతీ సహగమనాన్ని నిషేధించింది. ప్రభుత్వ అధికారులలో నిషేధానికి ఏకాభిప్రాయం లేకపోయినా, మానవతాదృక్పథం గల బెంటింక్ ముందడుగు వేశాడు. మనదేశంలో, ఇంగ్లండులో రామమోహనరాయ్ చేసినకృషిఫలితంగానే బెంటింక్ సతీసహగమన నిషేధానికి ముందడుగు వేశాడు. బెంటింక్ తన నిషేధపు ఉత్తరువులో కూడా రామ

మోహనరాయ్ పేరు ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

## ప్రీవీ కౌన్సిల్‌కు సనాతనుల అప్పీలు

అయితే సనాతనులు తక్కువవారా? "ధర్మసభ" అని ప్రారంభించి పెద్ద ఆందోళనచేసి బెంటిక్ నిర్ణయానికి వ్యతిరేకంగా ఇంగ్లండుకు అప్పీలు చేయించాలని నిర్ణయించారు. ప్రముఖ సుప్రీంకోర్టు లాయరు, కాన్సర్వేటిక్ అయిన ఫ్రాన్సిస్ బెఫీని ఇంగ్లండు పార్లమెంటులో సతీ సహగమనాన్ని సమర్థిస్తూ సనాతనుల కేసును వాదించడానికి పంపించారు. ఇంగ్లండులోని కన్సర్వేటివులు కూడా భారత సనాతలతో చేతులు కలిపారు.

అసలు కొంతమంది సనాతనులే స్వయంగా లండను వెళ్ళాలని, సతీసహగమనం నిషేధాన్ని తొలగింప జేయాలని అనుకున్నారు. కానీ, సీమ ప్రయాణం చేయాలంటే ఓడ ఎక్కాలని, అది సముద్రంపై ప్రయాణం చేస్తుందని తెలియగానే వాళ్ళ కాళ్ళు చల్లబడ్డాయి. మరి హిందువులకు సముద్ర ప్రయాణం నిషిద్ధంకదా. లేకపోతే, వెళ్ళినందుకు ప్రాయచిత్తం చేసికోవాలికదా. సతీ నిషేధంతో మతం మంటగలిసి పోతూవుందని సనాతనులు, ఛాందసులు, దేశంలో గగ్గోలు చేశారు.

## తాను ఇంగ్లండు వెళ్ళాలని నిర్ణయం

సనాతనుల ఆగడాలు, పార్లమెంటులో లాయరులను పంపాలన్న నిర్ణయం చూపిన రామమోహనరాయ్ సంఘసంస్కరణ ఉద్యమం విజయవంతం కావాలంటే తాను ఇంగ్లండువెళ్ళి పార్లమెంటులోనూ, ప్రజలలోనూ, ప్రజాభిప్రాయం గట్టిగా రూపొందించాలని లేకపోతే సనాతనుల కల్లబొల్లి మాటలకు ప్రభుత్వం మోసపోయే ప్రమాదం వుందని గమనించాడు. అసలు ఎంతో కాలంగా తాను పాశ్చాత్య దేశాలు వెళ్ళాలని కలలు గన్నాడు, తనకు పాశ్చాత్య దేశాలలో ఎందరో మిత్రులున్నారు. అందరి సహకారంతో మూఢనమ్మకాల్ని నిర్మూలించడానికి, సనాతన

ఛాందస భావాలు పారద్రోలి సైన్సు, పాశ్చాత్య విద్యపై ఆధారపడిన భవ్యభారతావనికి పునాదులు వేయాలని కలలుగన్నాడు.

## "రాజా" బిరుదు

"ఢిల్లీ చక్రవర్తి" రెండవ అక్బర్ తనకు యిస్తున్న ప్రభుత్వ పెన్షన్ చాలదని, దానిని పెంచమని బ్రిటీష్ రాజుకు వినతి పత్రం యివ్వాలని, దానిని ఇంగ్లీషులో పాండిత్యంగల రామమోహన్‌రాయ్ తనకు తగిన ప్రతినిధి అనిఅనుకున్నాడు. రాజ ప్రతినిధిగా రామమోహన్ రాయ్ వెళ్ళాలంటే తన రాయబారికి తగిన గౌరవం, హోదా, హుందా తనం యివ్వాలని "ఢిల్లీ చక్రవర్తి" రెండవ అక్బర్ రామమోహన్ రాయ్‌కి "రాజా" అనే బిరుదు ఇచ్చాడు. కాని ఈస్టిండియా కంపెనీ ఈ దౌత్యానికి అంగీకరించలేదు సరికదా, రామమోహనరాయ్‌కి యిచ్చిన "రాజా" టైటిలునుకూడా గుర్తించ నిరాకరించింది. కాని, "రాజా" అనే పదం ప్రజల హృదయంలో చోటుచేసుకొంది.

## ఇంగ్లండులో సాదరంగా ఆహ్వానం

రాజారామ్మోహన్‌రాయ్ రాజప్రతినిధిగా కాక, ఒక సామాన్య పౌరునిగా ఇంగ్లండు వెళ్ళాడు. ముఖ్యంగా సతీసహగమన నిషేధానికివచ్చే అడ్డంకులు తొలగించాలని అతని లక్ష్యం. 1831 లో "ఆల్‌బియన్" అనే నౌకపై దాదాపు ఆరు నెలలు ప్రయాణంచేసి ఇంగ్లండు చేరుకొన్నాడు. సంఘసంస్కరణకై, నవభావాల వ్యాప్తికై అతను చేస్తున్న కృషి కీర్తి ప్రతిష్టలు అప్పటికప్పుడే ఇంగ్లండులో వ్యాపించి వుండటంతో ఎక్కడికి వెళ్ళినా ఆదరాభిమానాలతో ఆహ్వానించారు. బ్రిస్టల్‌లో చరిత్రకారుడు రోస్కోను అతని జీవిత అవసానదశలో కలుసుకొన్నాడు. యుటలిటేరి యన్ ఫిలాసఫర్ జెర్మీబెంథామ్‌ను, బ్రిటీష్ సోషలిస్టు ఉద్యమ నిర్మాత రాబర్టు ఓవెన్‌ను, అమెరికాలోని హార్వర్డు యూనివర్శిటీ అధ్యక్షుణ్ణి, మాంచెస్టర్‌లో బట్టల మిల్లుకార్మికులను, బ్రిటీష్ రాజును రామ్మోహన్

రాయ్ కలుసుకున్నాడు. బ్రిటీషు రాజును కలవడానికి వెళ్ళినప్పుడు అతనిని "రాజా" రామ్మోహన్‌రాయ్‌గా పేర్కొని ఎట్టకేలకు ప్రభుత్వం అతనికి యిచ్చిన బిరుదును గుర్తించింది.

## ప్రీవీ కౌన్సిలులో విజయం

బ్రిటీషు పార్లమెంటులో ప్రీవీ కౌన్సిలులో సతీసహగమనం గూర్చి చర్చ జరిగినప్పుడు అధ్యక్షుని ప్రక్కనే రామ్మోహన్‌రాయ్‌ని సాదరంగా కూర్చోబెట్టారు. సనాతనుల ఎత్తులన్నీ చిత్తుఅయ్యాయి. సతీ సహగమన నిషేధం సరియైనదేనని ప్రీవీకౌన్సిలు తీర్పుయిచ్చింది. ఇది రాజారామ్మోహన్‌రాయ్ సంఘసంస్కరణ ఉద్యమానికి ఘనవిజయం.

ఫ్రెంచి విప్లవం పట్ల, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం పట్ల అత్యంత ఆదరంగల రామ్మోహన్‌రాయ్ 1832 అక్టోబర్‌లో ఫ్రాన్సును సందర్శించాడు. ఫ్రెంచి రాజు లూయీ ఫిలిప్పునికూడా కలుసుకొన్నాడు. మాక్స్‌ముల్లర్ వలె రాజా రామ్మోహన్‌రాయ్ ప్రాక్-పశ్చిమాలకు వారధివంటివాడు. రెండింటిమధ్యన సాన్నిహిత్యాన్ని పెంపొందించాడు.

## 1833లో ఇంగ్లండులో మరణం

విశాల దృక్పథం, నవ్యత్వం, శాస్త్రీయదృక్పథం, మానవతాదృష్టి సంఘసంస్కరణ ఉద్యమ నిర్మాత అయిన రాజారామ్మోహన్‌రాయ్ 1833 సెప్టెంబరు 27న ఇంగ్లండులోని బ్రిస్టలు నగరంలో జ్వర పీడితుడై హఠాత్తుగా మరణించాడు. ఈనాటికీ బ్రిస్టలులో రాజారామ్మోహన్‌రాయ్ సమాధివుంది. సతీసహగమన దురాచారాన్ని మాన్పించిన ద్రష్టగా చరిత్రలో రామ్మోహన్‌రాయ్ స్థానం చిరస్థాయిగా వుంటుంది.

## 1983వ సంవత్సరం 150వ వర్ధంతి

150 సంవత్సరాల క్రితం మరణించిన రాజారామ్మోహన్‌రాయ్

150వ వర్ధంతి ఉత్సవాలు దేశవిదేశాలలో ఈసంవత్సరం జరుగనున్నాయి. ఇంకా ఈనాటికీ మూఢనమ్మకాలు, విగ్రహారాధన, స్త్రీలను తక్కువగా చూచే ఆచారాలు కొనసాగుతున్నాయంటే సాంఘిక రంగంలో యింకా మన దేశం ఎంత వెనుకబడివుందో స్పష్టం అవుతోంది. రాజారామ్మోహన్ రాయ్ వంటి సంఘ సంస్కర్తల జీవితం యువతరానికి స్ఫూర్తిదాయకం.



## బహుభార్యాత్వ దురాచారాన్ని వ్యతిరేకించి, వితంతు పునర్వివాహాలకై కృషి సల్పిన

# సంఘ సంస్కర్త ఈశ్వరచంద్ర విద్యాసాగర్

బహుముఖ ప్రజ్ఞాశాలి, ప్రముఖసంఘసంస్కర్త, నాస్తికభావాలు కలిగిన ఈశ్వరచంద్రవిద్యాసాగర్ 19వ శతాబ్దంలో సమాజపరివర్తనకై ఎనలేని కృషి సల్పాడు. రాజారామమోహనరాయ్ సతీసహగమన దురాచారాన్ని అంతమొందించడానికి కృషిసల్పి ఆధునిక యుగంలో సంఘ సంస్కరణ ఉద్యమానికి నాంది ప్రస్తావన చేస్తే విద్యాసాగర్ ఆ ప్రయత్నాన్ని మరింత ముందుకు తీసుకువెళ్లి వితంతు వివాహాలకు, స్త్రీవిద్యకు—వికాసానికి, వివాహ వయస్సు పెంచడానికి, సమాజంలో వివిధరంగాలలో మార్పుకు తదేక దీక్షతో కృషి సల్పాడు. పాశ్చాత్య భావాలవలన ప్రభావితమై విద్యావిధానంలో మార్పుకు పూనుకొని, బెంగాలీ భాషకు, జాతీయతకు ప్రాధాన్యతనిచ్చి, యువతరంలో నవభావాలు ప్రాదుచేసికోవడానికి ధృవతారలాగా నిలిచాడు. ఎవరు ఎలాగ విమర్శించినా, దూషించినా, సహకరించ నిరాకరించినా నేను "ఒక్కడినైనాసరే" ముందుకు సాగుతానని ప్రతినబూని తాను మార్గదర్శకుడయ్యాడు.

మంచి సంస్కృతపండితుడయినా, మత ఛాందస భావాలనుండి విడివడి, సంఘసంస్కర్తగా, అజ్ఞేయవాదిగా, మానవతావాదిగా, నాస్తిక భావాల వ్యాప్తికి దోహదం చేస్తూ, గత శతాబ్దంలోనే నవీనతకు, విశాల భావాలకు, ఆచరణకు ప్రాధాన్యతనిస్తూ, బెంగాలులో ఒక సాంస్కృతిక విప్లవానికి ప్రతీకగా నిలిచాడు ఈశ్వరచంద్రవిద్యాసాగర్. ఆ ప్రభావం బెంగాలు వరకేకాక, మొత్తం దేశంపై పడింది. మహారాష్ట్రలో మలబారీ, కార్వే, ఆంధ్రలో కందుకూరి వీరేశలింగం, ఇంకా మరెందరో ఈశ్వర చంద్ర విద్యాసాగర్ కృషిని విస్తృతపరిచారు.

## 1820లో బెంగాలులో జననం

బెంగాలులోని మిద్నపూర్ జిల్లాలో 1820 సెప్టెంబరు 26న ఈశ్వరచంద్ర సంస్కృత పండితుల కుటుంబంలో జన్మించాడు. తండ్రి ఠాకూర్‌దాస్ బంద్యోపాధ్యాయ. తల్లి భగవతీదేవి. తల్లి ఉగ్గుపాలతో మార్పుభావాలను రంగరించి పోసింది. ఆ విశాల భావాలు అతని భావి జీవితాన్ని తీర్చిదిద్దాయి.

తన గ్రామంలో చదువుపూర్తి చేసుకొని 8సంవత్సరాల వయస్సులో అతి చురుకైన ఈశ్వరచంద్ర తండ్రితోపాటు కాలినడకన 4రోజులు నడిచి బర్‌సింఘా నుండి కలకత్తా చేరాడు. తండ్రి ఎంతో దారిద్ర్యంలో వున్నా కొడుకు చదువుకొని పైకిరావాలని తల్లి దండ్రుల ఆకాంక్ష, తండ్రికి నెలకు 2రూపాయలు జీతంవచ్చే ఉద్యోగం లభిస్తే దానికి చాలా సంతోషించాడు.

కలకత్తాచేరగానే ఈశ్వరచంద్ర సంస్కృత కళాశాలలో చేరి 16 సంవత్సరాలు చదివి నిష్ణాతుడయ్యాడు. సంస్కృత కాలేజీ అతనికి చదువు పూర్తి అయిన తరువాత "విద్యాసాగర్" అని టైటిల్ యిచ్చింది. చివరికి విద్యాసాగర్ పేరుతోనే ఈశ్వరచంద్ర ప్రఖ్యాతిచెందాడు.

## కులమతాల అడ్డుగోడలు

కులమత భేదాలు, పాతఆచారాలు, కట్టుబాట్లు మనిషికీ-మనిషికీ మధ్య అడ్డుగోడలు ఏవిధంగా నిర్మిస్తాయో ఈశ్వరచంద్ర చిన్నతనం నుండీ, తన జీవితానుభవంలో చూశాడు కలకత్తాలో సంస్కృత కాలేజీ, హిందూకాలేజీ ఒకే బిల్డింగులో వుండేవి. మధ్యభాగంలో సంస్కృత కాలేజీ, ఇటు ప్రక్క, అటుప్రక్క హిందూకాలేజి, హిందూకాలేజీలో ఇంగ్లీషు బోధించేవారు. అంతేకాక, అన్నికులాల హిందువులకు ప్రవేశం వుండేది. మహమ్మదీయులకు, క్రైస్తవులకు హిందూకాలేజీలో ప్రవేశం లేదు. అయినప్పటికీ అన్నికులాలవారితో సంస్కృత కాలేజీలో చదివే పైకులాల విద్యార్థులు కలవకూడదని ఒకేబిల్డింగులో మధ్యభాగంలో వున్న సంస్కృత కాలేజీకి ఇటూఅటూ ముందువైపు ఇనుపకడ్డీలు, తీగ వేసి విడదీశారు. దీనినిబట్టి ఆరోజుల్లో కులతత్వం నరనరాన ఎంతగా జీర్ణించి వుండేదో, హిందువులలోనే అన్ని కులాలవారూ కలవకుండా మానసిక హద్దులేకాకుండా, ప్రత్యక్షంగా అడ్డులు ఎలాగ అకాలంలో వుండేవో అర్ధంచేసుకొనుటకు యిది ఒక ఉదాహరణ.

విద్యార్థియైన విద్యాసాగర్ ఈ అడ్డంకులను దాటుకొంటూ అందరితో స్నేహం చేశాడు. బెంగాలులో విప్లవకారులతోకూడా అతనికి సంబంధాలు ఏర్పడ్డాయి. అయితే సమస్యల పరిష్కారానికి హింస మార్గం కాదని తాను గ్రహించాడు. బహిరంగంగా, ప్రజలకు నచ్చచెప్పటం వలననే మార్పులు రాగలవని భావించాడు.

1829లో సంస్కృత కాలేజీలో చదువు పూర్తి కాగానే, అతనికి అక్కడే ఉద్యోగం లభించింది. తాను ఆకాలేజీ అధిపత్యం స్వీకరించగానే వెంటనే హిందూకాలేజీని, సంస్కృత కాలేజీని విడదీస్తున్న ఇనుప బద్దీలను పీకివేయించి, అన్నికులాలవారూ కలవడానికి వీలుగా చేశాడు. అంతేకాదు అంతకు ముందు సంస్కృత కాలేజీకి ప్రతినెలలో చంద్ర యానం ప్రకారం అమావాస్యకి, పౌర్ణమికి, మొదటిరోజు, 8వరోజు

శలవలు యిచ్చేవారు. దీనినిబట్టి శలవురోజు నిశ్చయంగా వుండేదికాదు. తాను ఈపద్ధతిని మార్చివేసి ఆదివారం శలవుగా ప్రకటించాడు. దానితో ఈశ్వరచంద్రను నాస్తికుడని సనాతనులు నిందించారు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ విద్యారంగంలో, సమాజసేవలో, పత్రికారంగంలో, బంగ భాషాభివృద్ధికి, ఇంకా ఎన్నోరంగాలలో చేసిన కృషిని ఈఒక్క వ్యాసంలో వివరించడం సాధ్యంకాదు. సంఘసంస్కర్తగా విద్యాసాగర్ కొనసాగించిన కృషిని పేర్కొనడమే ఈవ్యాసం ప్రధానలక్ష్యం.

## వితంతు వివాహాలపై కృషి

రాజారామమోహనరాయ్ సతీసహగమనాన్ని నిషేధింప జేయగలి గాడు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వితంతు పునర్వివాహానికి పూనుకొన్నాడు.

అతి చిన్నవయస్సులోనే ఆ కాలంలో వివాహం చేయడంవలన బాల వితంతువులు చాలా ఎక్కువగా వుండేవారు. నెలల పిల్లలకే వివాహాలుచేస్తే, సంవత్సరంనిండని పసిపాప అప్పటికప్పుడే బాలవితంతు వయిపోయిన ఘటనలు వున్నాయి. ఇక ఆ పాపలు పెరిగి పెద్దవారైనా, తిరిగి వివాహం చేసుకొనడానికి వీలులేదు. వితంతు పునర్వివాహం అనాటి పెద్ద సాంఘిక సమస్య.

## "కులీనిజం" సాంఘిక దురాచారం

ఆనాటి సాంఘికాచారాలు కూడా వితంతువుల సంఖ్యను పెంచడానికి మరింత తోడ్పడ్డాయి. బెంగాలులో "కులీనిజం" అనేది వుండేది. పైకులాలలో, ముఖ్యంగా బ్రాహ్మణులలో కనీసం మరో శాఖవారితో కూడా వివాహం చేయడానికి అవకాశం వుండేదికాదు.

దీనితో ఆ పైకులాలలో అదేశాఖలో మొగపిల్లల గిరాకి విపరీతంగా పెరిగిపోయింది. ఎంతో మంది భార్యలను కలిగివుండటం ఒక సాంఘిక

దురాచారంగా మారిపోయింది. అది కొందరికి వ్యాపారంగా మారింది. ఒకే మగవాడు వయస్సుతో నిమిత్తంలేకుండా 10, 20మంది ఆడవాళ్ళను అదే శాఖనుండి పెళ్ళి చేసుకొనేవారు.

## 70-80 మంది భార్యలు

బహుభార్యత్వానికి వ్యతిరేకంగా ఈశ్వరచంద్ర విద్యాసాగర్ ఉద్యమం ప్రారంభించి, ఒక్క హుగ్లీ జిల్లాలోనే "కులీనిజం" ఎంత హేయంగా దిగజారిందో లెక్కలు సేకరించి ప్రపంచానికి చూపించాడు. హుగ్లీజిల్లాలో బోలానాధ్ బంద్యోపాధ్యాయ అన్న 55ఏళ్ళ "మహానుభావుడికి" 80మంది భార్యలు వుండేవారు. భగవాన్ చటోపాధ్యాయ అనే 64ఏళ్ళ మహాకప్రబుద్ధునికి 72మంది భార్యలు, పూర్ణముఖోపాధ్యాయ అన్న 55ఏళ్ళ అతనికి 64మంది భార్యలు, అంతెందుకు దుర్గా బంద్యోపాధ్యాయ అన్న 20ఏళ్ళ యువకునికి 16మంది భార్యలు వుండేవారు. ఒక్క జిల్లా కథే యిలాగవుంటే ఇక బెంగాలు అంతా పరిస్థితి ఎంత దారుణమో ఊహించవచ్చు.

బహుభార్యాత్వం ఎంత హేయమైన ఆచారంగా దిగజారిందీ అంటే, ఒకేవ్యక్తి ఒకేరోజున 3,4 పెళ్ళిళ్లు కూడా చేసుకొనేవాడు కుటుంబంలో అక్కా చెల్లెళ్ళకు అందరికీ కన్నెచెర విడిపించే మరో నాథుడు దొరకడని ఒక్కడికే వివాహంచేసే దుర్గతి కూడా వుండేది ఆ రోజులలో.

## రాజుకు 15 వేలమంది భార్యలు!

చరిత్రలోకి తొంగిచూస్తే నాసిరుద్దీన్ అనే మహ్మదీయ రాజుకు మధ్యయుగాలలో ఉత్తర భారత దేశంలో 15 వేలమంది భార్యలు వున్నారట! అది రాజుల ప్రతాపం. కాని తిండికే అంతంత మాత్రంగా వున్నా కొన్ని కులీన కుటుంబాలలో భార్యలకు మాత్రం కొదవ లేకుండా వుండేది.

తనకి భార్యగా కట్టబెట్టిన రజస్వలకాని చిన్న పిల్లల్ని కూడా అనుభవించిన దుర్మార్గులు కూడా ఆనాడు వుండేవారు. ముసలీ ముతకాకు

చిన్నపిల్లల్ని యిచ్చి పెళ్ళిచేయడంతో, భర్తకాస్తా గుటుక్కుమంటే, చిన్నపిల్లలైనా భార్యలు బజారుపాలు కావడం జరిగేది. ఈదారుణ దురాచారం అంతా శాస్త్రసమ్మతమనీ విధవా పునర్వివాహం కూడదనీ మతంపేర మారణ హోమం సమాజంలో చెలరేగుతూవుంటే ఈశ్వరచంద్ర సహించలేకపోయాడు.

## సమాజంపై ధ్వజమెత్తిన విద్యాసాగర్

మతనాయకులకు బుద్ధిచెప్పాలని, అమాయక స్త్రీలను రక్షించాలని, విధవా పునర్వివాహం జరపాలనీ, బహుభార్యత్వం నిషేధింప జేయాలని, కనీస వివాహ వయస్సు పెంచాలనీ, రజస్వలకానిదే కాపరానికి పంపరాదనీ, స్త్రీకి విద్యవుంటేతప్ప సమాజంలో మార్పురాదనీ, విద్యాసాగర్ ఎలుగెత్తిచాటాడు. అర్ధశతాబ్దంపాటు సమాజంతో పోరాడాడు.

ఈ సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయం తయారుచేయాలని పూనుకొన్నాడు.

వితంతు పునర్వివాహం ప్రధానంగా ఒక మానవ సమస్య. దానిని మానవత్వ దృక్పథంతో పరిశీలించి, పరిష్కరించాలని విద్యాసాగర్ పూనుకొన్నాడు. శాస్త్రరీత్యా, మతపరంగాకూడా వితంతువు తిరిగి పెళ్ళి చేసుకోవడం తప్పుకాదని నిరూపించాలని సంస్కృతంలో గొప్ప విద్వాంసుడైన విద్యాసాగర్ పూనుకొన్నాడు.

1855లో "పరసర్ సంహిత"లో వున్న శ్లోకాన్ని విద్యాసాగర్ వితంతు పునర్వివాహానికి అనుకూలంగా పండితులు, ప్రజల ముందుంచాడు. "భర్త ఎక్కడున్నాడో తెలియనప్పుడు, భర్త చనిపోయినప్పుడు, భర్త సన్యాసిగా మారిపోయినప్పుడు, అతను నపుంసకుడు అయినప్పుడు, భర్త (నైతికంగా) దిగజారిపోయినప్పుడు స్త్రీకి మరో భర్తను పొందే హక్కు వుందని" ఆ శ్లోకంలో వుంది.

ఈ శ్లోకం ప్రకారం వితంతువు అయినప్పుడు పునర్వివాహానికి స్వేచ్ఛ వుందని విద్యాసాగర్ దానిని ప్రోత్సహించాడు. 1856 డిశంబరు 7న విపరీతమైన వ్యతిరేకత, సాంఘిక వెలి మధ్య విద్యాసాగర్ మొదటి వితంతు వివాహం ఘనంగా జరిపించాడు. అతనికి ఎంతోమంది మిత్రులు దూరమయ్యారు.

విధవా వివాహం చేసుకున్నవారిని చంపుతామని, నిప్పుకి-నీరుకి వెలి అని ఎంత బెదిరించినా మానవతా దృక్పథంతో కూడిన విద్యాసాగర్ సాంఘిక విప్లవం క్రొత్త మిత్రుల అండదండలను పొందింది. శాంతి పూర్‌లోని నేతవాళ్ళ "MAY VIDYASAGAR LIVE LONG" అంటూ చీరల అంచులపై నేయడం ప్రారంభించారు. ఇక పాటలు, కవిత్వాలకు కొదవలేదు.

విద్యాసాగర్ అతి ధైర్యవంతుడు. ఎవరైతే తనను కొట్టాలని ప్రయత్నిస్తున్నారో, తిన్నగా వాళ్ళదగ్గరకే వెళ్ళి "మీకు ధైర్యంవుంటే కొట్టండి. నేను యిక్కడేవున్నాను" అనేసరికి నిరుత్తరులై పోయేవారు.

వితంతు పునర్వివాహం గురించి విద్యాసాగర్ వ్రాసినపుస్తకం కొద్దిరోజులలోనే 15వేల కాపీలు అమ్ముడుపోయింది.

విద్యాసాగర్ విధవావివాహాలతోనే ఆగలేదు, ఆడపిల్లల కనీస వివాహ వయస్సు పెంచాలని, స్త్రీలకు విద్యకావాలని, బహు భార్యాత్వం పనికి రాదని పెద్ద ఆందోళన చేశాడు.

స్త్రీలవిద్యకు మొదట్లో క్రైస్తవ మిషనరీలతో విద్యాసాగర్ కలసి పనిచేసినా, రానురాను వారికి దూరం అయ్యాడు. దానికి కారణం మిషనరీలు మతాంతీకరణకు ప్రాధాన్యత నివ్వడమే. అయినప్పటికీ, చాలా మంది బ్రిటీషువారితో కలసి విద్యారంగంలో విద్యాసాగర్ కృషిచేసల్పాడు. ఆరోజుల్లో స్త్రీ విద్యకు ఏమీ అవకాశం వుండేదికాదు. కాలేజీలలో స్త్రీలకు స్థానంలేదు. 1878లో కాదంబనీ బోస్ కలకత్తా యూనివర్సిటీ

ఎం|ఏన్సు పరీక్షకు మొదటిసారివెళ్ళి ద్వితీయశ్రేణిలో ఉత్తీర్ణులయ్యింది. ఆడవాళ్ళుకూడా పరీక్షలకు వెళ్ళవచ్చునని ఆ యూనివర్సిటీ రూల్సు చివరకు మార్చబడ్డాక ఇది సాధ్యం అయింది.

విద్యాసాగర్ ఇతరులకు వితంతు వివాహాలు చేసుకోమని చెప్పడమేకాక, తన కుమారుడు నారాయణ ఒక వితంతువును వివాహమాడుతానంటే ప్రోత్సహించి ఆదర్శప్రాయుడయ్యాడు. కొంతమంది మిత్రులు వితంతువివాహాలు ఇతరులకు చెయ్యాలిగాని, నీ కుటుంబంలో ఎందుకు అని వారించబోతే, వారిని గట్టిగా ఖండించాడు.

మత ఛాందస భావాలు విద్యాసాగర్‌కి ఎక్కడా లేనేలేవు. ఇంగ్లీషు అందరు చదువుకోవాలని, బెంగాలి భాష అభివృద్ధిచేయాలని కృషి చేశాడు.

1891 జూలై 29న విద్యాసాగర్ మరణించాడు. కాని ఈశ్వరచంద్రవిద్యాసాగర్ అభ్యుదయ, మానవతావాద భావాలు ఎంతో మందిని ఉత్తేజితం చేసి సమాజ సంస్కరణకు, విద్యావ్యాప్తికి పురి గొల్పాయి. 19వ శతాబ్దంలో గొప్ప సంఘసంస్కర్త ఈశ్వరచంద్ర విద్యాసాగర్.



## సాంఘికార్థిక సమస్యలతో ముడిపడిన

# వరకట్న దురాచారం

ఈమధ్య పేపర్లలో తరుచు వరకట్నం చాలలేదని అత్తమామలు భర్త రాసిర్రంపాన పెడితే ఆ బాధకు తాళలేక, మానసికంగా కృంగికృశించి చివరకు శరీరంపై కిరసనాయిలు పోసుకొని తమప్రాణాల్నే తీసుకొన్న యువతుల దయనీయ గాథలను చదువుతున్నాం. ఈరకంగా కొన్ని ఆత్మ హత్యలయితే, మరికొన్ని భర్త, అతని బంధువులు బుద్ధిపూర్వకంగా జరిపే ఘాతుక హత్యలుగా తేలుతున్నాయి. మూడుపువ్వులు–ఆరుకాయ లుగా, ఆనందంగా, ఉత్సాహంగా, అందరితో కలసిమెలసి హాయిగా వుండి భర్తతో సంసార జీవితం గడపవలసిన ఆ యువతులు, వరకట్న దురా చారంవలన జీవితసౌఖ్యం కోల్పోయి, చివరకు తమ ప్రాణాల్నే కోల్పో తున్నారు. ఇది మానవత్వానికి కళంకం. సర్వ ప్రపంచానికే తలవంపు.

అయినా, వరకట్నదురాచారం నిరాటంకంగాకొనసాగిపోతూవుంది. ఎంత ఎక్కువగా చదువుకొంటే, ఎంత ఎక్కువగా ఆస్తివుంటే, అంతగా వరుని ధర పలుకుతోంది. కట్నానికి అమ్ముడు పోవడానికి యువకులు ఎగబడుతున్నారు.

వరకట్నం తప్పని, అదిసాంఘిక దురాచారమని, దానిని అంత మొందించాలని వేదికలెక్కి చెప్పే కొందరు అభ్యుదయ భావాలుగలవారు కూడా ఆచరణ దగ్గరకు వచ్చేసరికి, పాతభావాలకు, ఆచారాలకు బానిసలై వరకట్న దురాచారాన్ని ఆచరణలో అనుసరిస్తున్నారు. వీరే ఇలాగవుంటే యిక సామాన్య ప్రజానీకం గురించి వేరే చెప్పనక్కరలేదు.

వరకట్నం తప్పని ప్రభుత్వశాసనాలు ప్రతీరాష్ట్రంలోవున్నా, పత్రి కలూ-ప్రచార సాధనాలూ వరకట్నాన్ని వ్యతిరేకిస్తూ ప్రజాభిప్రాయాన్ని

రూపొందించాలని కృషిచేస్తున్నా, ఆచరణలోమాత్రం ఈ దురాచారం అన్ని తరగతుల ప్రజలలో కొనసాగిపోతూవుంది.

## 'స్టేటస్ సింబల్'గా మారింది

ఇదివరకు వరకట్న దురాచారంలేని షెడ్యూల్డు తెగలు, యితర కులాలు, మతాలలోకూడా వరకట్న దురాచారం యిదివరకు కంటే ప్రబలి పోతూవుంది. దానికికారణం వరకట్నాన్ని యువకులు సోషల్ స్టేటస్‌గా భావించడమే. వరకట్నం ఆర్థికంగా లాభదాయకంగా వుందికనుక, డబ్బుకే ఆధునిక సమాజంలో ఎక్కువ విలువ యివ్వడం జరుగుతోంది కనుక, ఇతర సాంఘిక, నైతిక విలువలు కట్నానికి తలవగ్గుతున్నాయి.

ఆర్థికంగా బలంగా వున్నవారిలో కట్నాలదురాచారం ఎంతగా వున్నా వెంటనే ప్రజలకు అంతగా నష్టం కలగకపోవచ్చు. కానిఈనాడు సామాన్య కుటుంబాలలోని యువతుల వివాహ సమస్యకూడా కట్నాలతో ముడిపడటం వలన ఎంతోమంది యువతుల జీవితంతో ఈ సమస్య చెలగాటంఆడుతోంది. వారిలోనిస్సహాయత, అసంతృప్తిజ్వాలలు ప్రజ్వరిల్లుతున్నాయి. ఎంతగా చదువుకొంటే అంతగా కట్నం సమస్య పెరుగుతోంది కనుక చైతన్యవంత మయిన, విద్యాధికులైన యువతుల పరిస్థితి మరీ దారుణంగా వుంది.

## మారుతున్న విలువలు

ఈనాటి మన సమాజం పాత క్రొత్తల సంధికాలంలో వుంది. పాత విలువలు పట్టుసడలినట్లు పైకికనబడినా, రెండవప్రక్క క్రొత్తవిలువలు బలపడలేదు కొన్ని రంగాలలో సమానత్వం వచ్చినా, మరికొన్ని రంగా లలో అసమానత్వం యధాతధంగా కొనసాగుతూ వుంది. స్త్రీ పురుషులకు సమానంగా రాజకీయరంగాలలో ఓటుహక్కు వచ్చినా, ఆర్థిక—సాంఘిక రంగాలలో అసమానత్వం అలాగే వుంది స్త్రీలకు ఆస్తిహక్కులో సమాన భాగం లభించలేదు. సాంఘిక రంగంలో స్త్రీ తక్కువ, అణగబడి వుండా లన్న భావంపోలేదు. విద్యారంగంలో స్త్రీలు కొంత ముందడుగు వేసినా,

పాతఆచారాలు, అలవాట్లు వారికి గుదిబండలుగా తయారయి ఒకరంగంలో సాధించిన అభివృద్ధిని అవి మరో రంగంలో వెనుకకు లాగేస్తున్నాయి. అందుచేతనే స్త్రీ సమానత్వం సాధించాలంటే అన్నిరంగాలలో సమగ్రంగా మార్పుకై కృషి కొనసాగాలి.

## బలమైన ప్రజాభిప్రాయం కావాలి

సాంఘిక రంగాలలో మార్పు మనుష్యుల మనస్సులపై ఆధారపడి వుంది. వారి దృక్పథంలో మార్పురావాలి. అందుచేత సాంఘిక రంగాలలో మార్పులకై ప్రభుత్వం చేసేశాసనాలు విజయవంతం కావాలంటే బలమైన ప్రజాభిప్రాయం రూపొందాలి. పాతఆచారాలను అనుసరించేవారి సాంఘిక బహిష్కరణ జరగాలి. మార్పుమార్గాన్ని అనుసరించే వారిని అభినందించి, సహకరించి తోడ్పడాలి.

సతీసహగమనం నిషేధిస్తూ ప్రభుత్వం చేసినశాసనం, బాల్యవివాహాలపై నిషేధం, వితంతు పునర్వివాహాలకై కృషి — యివి అన్నీ ప్రజాభిప్రాయం బలపడుతున్నకొద్దీ విజయవంతం అయ్యాయి.

అదేవిధంగా వరకట్న నిషేధం విజయవంతం కావాలన్నాకూడా పట్టుదల, దీక్షతో అన్నిరంగాలలో కృషిజరగాలి. ప్రజాభిప్రాయాన్ని అనుకూలంగా కల్పించడానికి ప్రయత్నం జరగాలి.

## వరకట్న నిషేధ శాసనాలు

ఆ కృషికి మరింత బలం చేకూరాలంటే ఈనాడు ఉన్న వరకట్న నిషేధ శాసనాన్ని మరింత కట్టుదిట్టంగా రూపొందించి, దానిని అమలు పరచడంలో వస్తున్న అడ్డంకులను తొలగించడానికి ప్రభుత్వంవైపునుండి కూడా కృషి జరగాలి.

మనదేశంలో వరకట్నాన్ని నిషేధిస్తూ శాసనాలు చాలాకాలంగా వున్నాయి. 1939లో అవిభక్త భారతదేశంలోని సింధు రాష్ట్రంలో 1939లో

"లేవీ-దేవీ యాక్ట్" అని చట్టం రూపొందించబడింది. చట్టం చక్కగా వున్నా, దాని అమలుమాత్రం నామమాత్రంగానే వుండిపోయింది.

స్వాతంత్ర్యానంతరం 1950లో బీహారులోను, 1958లో ఆంధ్ర ప్రదేశ్‌లోను వరకట్న దురాచారాన్ని అంతమొందించడానికి శాసనాలు చేశారు.

దేశానికంతటికీ వర్తించే విధంగా వరకట్ననిషేధచట్టం చేయాలని 1950 నుండీ పార్లమెంటులో ప్రయత్నాలు కొనసాగుతూనేవచ్చాయి. ఈ విషయంగురించి ఎన్నో ప్రైవేటు మెంబర్ బిల్లులు పార్లమెంటులో ప్రవేశపెట్టబడటం, కొన్నిటిని సభలో చర్చించడం జరిగింది. శ్రీమతి ఉమా నెహ్రూ 1953లో లోక్ సభలో ప్రవేశపెట్టిన బిల్లుపై చర్చలో పాల్గొంటూ ఆనాటి న్యాయశాఖామంత్రి కేంద్రం రాష్ట్రాలను సంప్రదించి బిల్లు తెస్తుందని హామీ యిచ్చారు. కాని, "హిందూ సక్సెషన్‌యాక్టు" రూపొందాకే ఈ విషయంపై బిల్లు చేయాలని భావించారు 1956లో ఆ బిల్లు రూపొందినా వరకట్నంబిల్లు మాత్రం కనుమరుగైంది. పార్లమెంటు సభ్యులు ఎన్నో ప్రైవేటు మెంబరు బిల్లుల ద్వారా ఈవిషయాన్ని ప్రభుత్వం దృష్టికి తెచ్చారు.

చివరికి 1959 ఏప్రిల్ 24న Dowry Prohibition bill లోక్ సభలో ప్రవేశపెట్టారు. జాయింటు కమిటీ రిపోర్టు అనంతరం లోక్‌సభ కొన్ని మార్పులతో ఈ బిల్లు ఆమోదించింది. లోక్‌సభ చేసిన మార్పులను రాజ్యసభ అంగీకరించలేదు. చివరకు పార్లమెంటు రెండుసభల సంయుక్త సమావేశం జరిపి 1961 మే లో వరకట్న నిషేధ చట్టాన్ని ఆమోదించింది.

పార్లమెంటు చేసిన చట్టం అనంతరం బీహారు, పశ్చిమబెంగాలు, ఒరిస్సా, హరియానా, హిమాచలప్రదేశ్‌లో తమ స్థానిక పరిస్థితులకు అనుగుణంగా వరకట్న నిషేధ చట్టాలను రూపొందించడంజరిగింది. కట్న దురాచారాన్ని మాన్పించడంలో భాగంగా పెళ్లిపై ఖర్చును అదుపుచేస్తూ నిబంధనలుకూడా కొన్నిచోట్ల చేశారు.

పెళ్ళి అయిన యువతి 5 సంవత్సరాలలోగా చనిపోతే కట్నం సమస్య దానికి కారణమేమోనని పరిశోధించాలని పోలీసు అధికారులను ఆదేశించారు.

## పార్లమెంటరీ సంఘం పరిశీలన

పార్లమెంటులో శ్రీమతి ప్రమీలా దండావతే 1980 డిశెంబరులో ఒక ప్రైవేటు మెంబరు బిల్లు ద్వారా కట్నదురాచారం గురించి మరోసారి ప్రభుత్వ దృష్టికి తెచ్చింది ప్రభుత్వం వరకట్నబిల్లు ఏవిధంగా పని చేస్తోందో పరిశీలించడానికి 1930లో ఒక పార్లమెంటరీ సంఘాన్ని నియమించింది. దానికి శ్రీమతి కృష్ణ సాహే అధ్యక్షురాలు. దేశమంతా పర్యటించి వరకట్న సమస్య గురించి ఆ కమిటీ వివరాలు వివిధ సంస్థలు, వ్యక్తులనుండి సేకరించి 1982 ఆగస్టులో తన కమిటీ నివేదికను పార్లమెంటుకు సమర్పించింది.

1961లో చేసిన వరకట్నం బిల్లు పనిచేసే తీరు గురించి ఈ పార్లమెంటరీ సంఘం జరిపిన విచారణలో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు వెలుగులోకి వచ్చాయి. సాంఘిక సమస్యలపై చట్టం చేసినంత మాత్రానే చాలదని, ఆ చట్టం అమలు జరగడానికి పట్టుదలతో, దీక్షతో ప్రజాభిప్రాయాన్ని రూపొందించడానికి ప్రక్కనే ప్రయత్నంకూడా జరగాలి అన్న విషయం మరోసారి స్పష్టం అయింది.

వరకట్నం నిరోధక చట్టం క్రింద కట్నం తీసుకొనేవారిని శిక్షించడానిక్కి అవకాశంవున్నా, కోర్టుకు వెళ్ళేవారు ఎవరూకనబడటంలేదు. ఫిర్యాదు చేసే వారి సంఖ్యకూడా చాలాతక్కువ, అలా ఫిర్యాదులు వచ్చిన కేసులలో కూడా నూటికి 5,6 కేసులకే శిక్షలు ఏమయినా పడుతున్నాయి. వరకట్నం యిచ్చే విషయంలో సాక్ష్యాధారాలు లభించడం కష్టం.

అదేవిధంగా వరకట్నం తేలేదని స్త్రీలను బాధించి చంపిన సందర్భాలలో కూడా దోషులకు తగిన శిక్షలు పడటంలేదు. వాటిని ఆత్మహత్య

క్రింద చిత్రీకరించి నేరస్థులు తప్పించుకొంటున్నారు. చనిపోయిన వాళ్ల మీద నేరం తోసేయడం విచారణ చేసేవారికికూడా అనువుగా వుండవచ్చు.

## మెడికల్-లీగల్ ఇన్‌స్టిట్యూట్ లెక్కలు

వరకట్న దురాచారాలవలన జరిగిన హత్యలను పరిశీలిస్తే అవి ఎక్కువగా హిందువులలో కనబడుతున్నాయి. దానికి కారణం హిందువులు మెజారిటీ కావడంకూడా కావచ్చు. భోపాలులోని మెడికల్ లీగల్ ఇన్‌స్టిట్యూట్ డైరక్టర్ డాక్టర్ హరిశ్చంద్ర కథనం ప్రకారం 16 నుండి 25 సంత్సరాల వయస్సులో వున్న స్త్రీలు 1981లో ఎక్కువమంది మరణించారట. కాని పోలీసు రికార్డులలో మాత్రం స్టవ్‌వల్ల వళ్ళు కాలిందనో లేదా అగ్నిప్రమాదమనో పేర్కొనడం జరుగుతోందని, ఆ రకంగా చనిపోయినవారు అంతకు కొద్దికాలంముందే వివాహం చేసుకొన్నవారు కావడం గమనార్హం అని వివరించారు.

1981లో మరణించిన వారిలో ఆయన లెక్క ప్రకారం 79 మందిలో 69 మంది హిందువులు, 3 గురు ముస్లింలు, ఒక క్రిస్టియన్ స్త్రీ వున్నారు. పెళ్ళి అయిన రెండు గంటలలోనే నవవధువు మంటలకు ఆహుతి అయిన దారుణ సంఘటనలు కూడ వున్నాయని ఆయన పేర్కొన్నారు.

## కేంద్ర హోంశాఖ సర్క్యులర్

కేంద్రప్రభుత్వం హోంశాఖ సర్క్యులర్ ప్రకారం వరకట్నం సందర్భంలో హత్య జరిగితే, 5 సంవత్సరాలలోగా ఆ స్త్రీ వివాహం జరిగివుంటే ప్రత్యేక విచారణ జరగాలని, శవపరీక్ష తప్పకుండా జరగాలని ఆదేశించడం జరిగింది.

అసలు వరకట్నం గురించి ఎన్ని కేసులు వస్తున్నాయో చూడాలంటే మచ్చుకు బీహారును తీసుకోవచ్చు.

1976లో 212 కేసులు, 1977లో 44 కేసులు, 1978లో 22, 1979లో 19, 1980లో 15, 1981లో 36 కేసులు యాంటీడౌరీ డైరెక్టరేట్‌కి అందాయి భార్యాభర్తలు విడిపోయాకో, స్త్రీని చంపడం జరిగితేనో వాళ్ళు రిపోర్టు చేస్తారుకాని, తక్కిన సందర్భాలలో ఎవరూ కంప్లయింటు కూడా చేయడంలేదు.

వరకట్నం గురించి వచ్చిన కేసులలో మళ్ళీ అలాంటి నేరం ఎవరూ చేయకుండా కఠినంగా శిక్షించ వలసిన అవసరం ఎంతైనావుంది.

## డిపార్టుమెంట్ ఆఫ్ సోషల్ ప్రోబ్లమ్స్

ఇప్పటికప్పుడే పోలీసు వ్యవస్థ ఎన్నో విషయాలు అమలు పరచడంలో తలమునకలుగా వుంది కనుక వరకట్న నిషేధచట్టాన్ని అమలు పరచే బాధ్యత డిపార్ట్‌మెంట్ ఆఫ్ సోషల్ ప్రోబ్లమ్స్ అని ఏర్పాటు చేసి దానిలోని ఆఫీసర్లు అయిన సోషల్ వర్కర్లకు అప్పగించాలని కొంతమంది సూచించారు. వరకట్నం అనేది కేవలం లా అండ్ ఆర్డరు సమస్య మాత్రమే కాదని, జనరల్ విషయాలలో అంటే హత్యలు కానప్పుడు, సోషల్ వర్కర్లే దానిని సమర్ధవంతంగా నిర్వహించగలరని ఒక అభిప్రాయం వుంది. దీనిని కొందరు ప్రభుత్వాధికారులు కూడా బలపరిచారు.

## ఫామిలీ కోర్టులు

ఢిల్లీ పోలీసు సూపరెంటెండెంట్, శ్రీమతి కరన్ బేడీ పార్లమెంటరీ కమీషను ముందు తన అభిప్రాయాలు చెబుతూ వరకట్న నిషేధ ఆఫీసర్లని ప్రత్యేకంగా వుండాలని, ఫామిలీ కోర్టులను ఏర్పరచాలని, రాజీ చేయడానికి కొందరు అధికార్లు వుండాలని, వరకట్న బాధితులకు ఉచిత న్యాయ సహాయం ప్రభుత్వం అందజేయాలని ఆమె కోరింది. వరకట్నం తేలేదని భర్త, అతని కుటుంబసభ్యులు పీడిస్తూవుంటే ఇంట్లోనుండి వచ్చి కొంత కాలం ఆ స్త్రీ వుండటానికి వీలుగా కట్న

SAK Acc. No. 9186

బాధితుల రక్షణ కేంద్రాలను కూడా ప్రభుత్వం ఏర్పాటు చేయాలని ఆమె సూచించింది. కట్నం సమస్యల వలన ఎవరైనా విడాకులు యివ్వవలసి వచ్చినా, ఎడబాటు కలిగిన ఆ స్త్రీకి భర్త నుండి వెంటనే తన జీవితానికి వీలుగా Maintenance allowance యిప్పించే ఏర్పాటు చేయాలని, పిల్లలు వున్నప్పుడు వారిని తల్లి రక్షణలోనే వుంచాలని, భర్తతో ఎడబాటు తప్పనిసరి అయినప్పుడు ఆ స్త్రీకి విడాకులు ఎక్కువ కాలయాపన లేకుండా త్వరగా లభించాలని శ్రీమతి కరన్ బేడీ సూచించింది.

పార్లమెంటరీ విచారణాసంఘం ముందు రకరకాల సూచనలు వచ్చాయి. వివాహం సందర్భంలో దూబరా ఖర్చు, ఆడంబరాలు తగ్గించాలని, ప్రతీ వివాహాన్ని తప్పనిసరిగా ప్రభుత్వంవద్ద రిజిస్టరుచేయాలని, పెళ్ళికి ఎంత ఖర్చు చేసిందీ వివరాలతో అఫిడవిట్ యివ్వాలని, పెళ్ళి ఖర్చులు తగ్గించడానికి ప్రభుత్వమే "Marriage House"ని రష్యాలో లాగ నిర్వహిస్తే, అక్కడ నిరాడంబరంగా వివాహం జరిపించవచ్చునని, కట్నదురాచార నిర్మూలనలో స్వచ్ఛంద సంస్థల సహకారం ప్రభుత్వం తీసుకోవాలని, వరకట్నానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయం రూపొందించడానికి కృషిజరగాలని, వివిధ సూచనలువచ్చాయి. వరకట్నం అనేది Cognizable Offence చెయ్యాలని, అంటే ఎవరూ ఫిర్యాదు చేయనవసరం లేకుండా పోలీసులే తమంతట తాము చర్య తీసుకొనే విధంగా వుండాలని కొందరి సూచన. అలా చేస్తే పోలీసులు ప్రజలను సతాయించే ప్రమాదం వుందని మరికొందరి భావం.

## పద్ధతి ఏదైనా వరకట్నం పోవాలి

పద్ధతి ఏదైనా వరకట్న దురాచారం పోవలసిందే. ప్రభుత్వం ఎంత సమర్థవంతంగా వ్యవహరిస్తే, ఎంతగా ప్రజాభిప్రాయం పెరిగితే అంత త్వరగా ఈ సాంఘిక దురాచారాన్ని అంతమొందించి స్త్రీలకుకూడా సమానస్థానాన్ని సమాజంలో కల్పించటం సాధ్యం అవుతుంది.

# గోరా సాహిత్యం

| పుస్తకం | రచయిత | వెల |
|---|---|---|
| నాస్తికత్వం లేక దేవుడు లేదు | | 6-00 |
| దేవుని పుట్టుపూర్వోత్తరాలు | | 1-50 |
| సృష్టిరహస్యం | | 3-50 |
| నేను నాస్తికుణ్ణి | | 3-50 |
| మూఢనమ్మకాలు - నాస్తికదృష్టి | | 4-00 |
| నాస్తికత్వం - ప్రశ్నోత్తరాలు | | 2-00 |
| నాస్తికత్వం ఎందుకు? | | 1-50 |
| నాస్తికత్వం అవశ్యకత | | 3-00 |
| ఆర్థిక సమానత్వం - నాస్తికదృష్టి | | 4-00 |
| జీవితం నేర్పిన పాఠాలు | | 4-00 |
| ప్రజాస్వామ్యం పెరగాలంటే నాస్తికత్వంకావాలి | | 1-50 |
| ప్రజలు-ప్రభుత్వం | | 3-50 |
| సంఘదృష్టి - నాస్తికత్వం | | 4-00 |
| అరుమాసాలలో అందరికీ చదువు | | 4-00 |
| అతీతశక్తుల బండారం | విజయం-సుమతి | 5-00 |
| నవ సమాజ నిర్మాతలు | డాక్టర్ విజయం | 5-00 |
| నాస్తికత్వం - అభివృద్ధి చరిత్ర | లవణం | 4-00 |
| కోవూర్ జీవితం | లవణం | 4-00 |
| సైన్స్-నాస్తికత్వం | డాక్టర్ సమరం | 1-50 |
| సైన్స్-ఆరోగ్యం | డాక్టర్ సమరం | 5-00 |
| సైన్సు-మనస్సు | డా॥ సమరం | 5-00 |
| స్త్రీలు-వైద్య విజ్ఞానం | డాక్టర్ మారు | 4-00 |
| గోరా - నాస్తికుని జీవితం | వి. విశ్వనాథం | 15-00 |
| నాస్తికత్వం కావాలి | ఛార్లెస్ బ్రాడ్లా | 2-00 |
| బాణామతి అబద్ధం | రిపోర్టు | 3-00 |
| చరిత్ర సృష్టించిన సైంటిస్టులు | డాక్టర్ విజయం | 5-00 |
| దేశదేశాలలో నాస్తికత్వం | డాక్టర్ విజయం | 5-00 |
| స్వేచ్ఛా సమర యోధులు | ” | 3-00 |
| ప్రగతి పథంలో స్త్రీ | మైత్రి | 3-00 |
| పునర్జన్మ కట్టుకథలు | | 3-00 |
| స్త్రీలు-వ్యాధులు | డా. మారు | 5-00 |
| స్త్రీ సమస్యలు-సంఘసంస్కరణ | జి. సకల | 5-00 |

నాస్తిక కేంద్రం, పటమట, విజయవాడ - 6